విడిప్రతిక ౧ అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ 102576 జూన్ ౨ వ తేది ౧౯౩౬ సోమవారము అర్ధ సం॥ చందా రూ ౩

సంపుటము ౧౧ | త్రూపుబజారు, హైదరాబాదు - దక్కన్. | సంచిక ౧౫

శా. శ. ౧౮౫౮ శ్రీ ధాత సం॥ ఆషాఢ శు౧౧ సో మ వా ర ము. ౨౫ అమర్దాదు ౧౩౪౫ ఫ.

# పంచదార పరిశ్రమ

పి. వి. రమణా రావు గారు

బి. యస్సి. (అగ్రి) టెక్నాలజీ

## నాలుగవ అధ్యాయము

## హిందూదేశములో చెరకుపంట

### చెఱకుచెట్టు భాగములు

చెరకుచెట్టును నాలుగుభాగములుగా విభజించవచ్చును: (౧) వ్రేళ్లు, (౨) గడ్డ, (3) ఆకులు. (౪) విత్తనము. వ్రేళ్లుచెట్టును పడిపోక భూమిపై నిలబెట్టును. భూమిలోనిసారమును, నీటినిభద్రపరచి కావలసినప్పుడు చెట్టుకువ్యాపింపజేసి దానిజీవనమునకు మూలకారణ మగుచున్నవి. వేర్వేరు చెట్లకు వేర్వేరువిధముల పదార్థములు కావలయును. నీటిలో ముఖ్యమైనవి (Potassium)పొటాసియము,(Phospherous) ఫాస్ఫరసు, (Calcium) కాల్సియము (Nitrogen) నత్రజని. పిల్లవేళ్లు భూమిలో ...వ్యాపించి నీటిని, ఆహారమును ...చేరుకుపంపును. అక్కడనుసం...రా ఈవస్తువులు గడ్డకుండి ...క్కువ గాలివేసినప్పు వి ...ము కురిసినప్పుడుగాడు ...డుటకుగాను వేళ్లసటుతని మనకు కొన్నింతఆశ్యకమో అంతయే.

### ...డలోని రహస్యములు

...గడకణుపులక్రింద విభజింపబడియున్నది. ...క్కొక్కకణుపు ఒకటిమొదలు ఎనిమిది అంగుళములవరకునుండును. ప్రతికణుపునుండి ఒక ...న్న మొగ్గ బయలుదేరును. ఈమొగ్గనుండి ఆకు ...వి పొడుగుగా, సన్నగా మూడునాలుగుఅడుగులపొడుగున పెరుగును. ఈఆకులు విప్పలవి...గా పెరిగి తగినసూర్యరశ్మిని, వాయుపదార్థము...ను సంపాదింపగలుగునవిగా జేయుటకై గడ్డ ముఖ్యావసరముకానున్నది. అంతేకాక ఈ ...డలో తయారైన సూక్రోజంతయు భద్రము...గా దాచబడుచున్నది. పైభాగము చాలగట్టి...గానుండి దానిపై రంగు పూయబడినట్లుండును. ...కణుపులుకూడ చాలగట్టిగానుండును. ఈరెం...డు పదార్థములలోను సూక్రోజుచాల తక్కువ. ...దీటిలోని సెల్సుకూడ చాలచిన్నవిగానుండి ...యు పీచుగలవై అగుపడును.

కాని లోపలిభాగము చాల మెత్తగానుండి ...ద పెద్ద గదులమాదిరిగానుండును. గదులు గా...న్నను, ఈగదులు మైక్రోస్కోపు పెట్టిచూ...స్తేగాని కనపడవు. ఈగదులలో మనము గా...జులో వడ్లనుదాచుకొనుమాదిరి సూక్రోజు దా...చబడియున్నది. ఈగదులకుమధ్య సన్నని గొట్ట...ములు వ్రేళ్లనుండి ఆకులకు, పువ్వులకు వ్యాపించును. వీటినుండి ఆహారపదార్థములు తీసి...కొనిపోబడుచున్నవి. గడను అడ్డముగా కోసి ...మైక్రోస్కోపుతో పరిశీలించిన ఇవన్నియు ...గనపడును.

### ఆకుయొక్క పని

ఆకుచేయవలసిన పనులనేకములున్నవి. ఇది దాక ఫ్యాక్టరీవలె సూక్రోజును తయారుచేసి, గడకు పంపుచున్నది. ఉచ్ఛ్వాసనిశ్వాసములకు ముఖ్యమైన ముక్కులేకున్న, మన మెట్లుజీవింతుమో అగతియే ఆకులులేకపోయిన చెట్టునకుకూడబట్టును. ఒకచతురపంగుళము ఆకును పరిశీలించినచో దానిలో అనేకవేల చిల్లులుండును. ఈచిల్లులనుండియే గాలిని పీల్చుచున్నది. మనము ప్రాణవాయువునుపీల్చి, బొగ్గు పులుసు గాలి (అనగా కార్బన్ డైఆక్సైడు) వదలుదుము. ఈవదలిన గాలి చెట్లకు ముఖ్యముగాఅవసరము. ఇట్టి గాలిగుండఆకులును పీల్చుచున్నవి. వ్రేళ్లు హైడ్రోజనును, బొగ్గుపులుసుగాలిని, ప్రాణవాయువులను, నీటిని భూమినుండి ఆకులకు పంపుచున్నవి ఇవన్నియుకలసి సూర్యరశ్మియొక్క శక్తిచేతను. ఆకులపైనుండు పచ్చని పదార్థము చేతను చక్కెరగా మార్చబడుచున్నది. ఉపయోగింపబడిన శక్తి ఆకులు తెగులపెట్టబడినప్పుడు బాగుగా మరల భూమినిజేరి సారవంతము చేయుచున్నది. అవసరములేని వాయుపదార్థములన్నియు ఆకులలోని కన్నములద్వారా పైకిపోవుచున్నవి. భూమిలో తేమ ఎక్కువైన ఆకులద్వారా కొంతపోవుచున్నది. భూమిలో నీరుతక్కువైనఆకులు గాలినుండి కొంత తీసుకొనుచున్నవి.

### చెఱకుపూవు, విత్తనము

విత్తనము ఇది తుదికాలములో బయటపడును. పువ్వులయందలి పుప్పొడిపువ్వునుండి పువ్వుకు వ్యాపించుటచే అవి పక్వమునకువచ్చి ఫలించుచున్నవి. ఈపుప్పొడి వ్యాపకము గాలివలనను, పువ్వులమీదవ్రాలు పురుగుల మూలమునను సంభవించుచున్నది. పక్వమునకువచ్చిన విత్తనములు నాటిన, అవి మొలకలెత్తును. కాని చెరకునకు పువ్వుపూసిన గడమరిపెరుగుట మానివేయును. అంతేకాక చెన్ను చేపేర్పడిన సూక్రోజు కొంతభాగము క్రమముగా తగ్గిపోవును. పువ్వుపూసిన ఒకనెలవరకు భయములేదు. కాని ఆపైని చెరకును కోయకయుంచిన దానివిలువ తగ్గిపోవును. ఈకారణములచేతనే చెరకునకు వెన్నుపుట్టిన ఏదో ప్రమాదముగా భావించి భయపడుదురు. దేవతలకు కోపమువచ్చినదనియో ఏదోపిచ్చిభ్రమ పడుటయుగూడ గలదు. "చెరకునకు వెన్నుపుట్టిన చెరకున తీపెల్లచెఱచు" అను పద్యము కూడ గలదు.

### చెరకుపంటకు తగినచోటు

చెరకులో అనేకరకములున్నవి. కొన్ని సన్నగాను పొడుగుగాను ఉండును. మరికొన్ని లావుగాను పొడుగుగాను ఉండును. పైరంగుకూడ ఎన్నోవిధములుగ నుండును. ఎరుపు, పసుపు, నీలం చారలు మొదలైనవి. వాటిని వర్గములుగా విభజించుట చాలకష్టము. ఉత్తర హిందూదేశమునందలి చెరుకంతయు సాధారణముగా సన్నగాను, పొట్టిగాను ఉండును. దక్షిణమున చెరకు లావుగాను పొడుగుగానుండును. మొత్తముమీద హిందూదేశము యావత్తు ఈచెరకు పంటకు అనుకూలముగానున్నను, భూమధ్యరేఖకు సమీపముననున్న మన మదరాసు రాజధానిలో బాగుగా పెరుగుననుటకు సందేహములేదు. చెరకుపంటకు సహజముగా ఉష్ణప్రదేశము లావశ్యకము. దానికితోడు నీటి సదుపాయము కావలసియున్నది. అందుచే పల్లపు భూములలోను (Wet lands) సమభూములలోను (Garbed lands) మెరక భూములలోకన్న (Dry lands) ఎక్కువగా ఫలించును. ఇసుకనేలలు మంచివికావు. ఎందుచేతనన నీరు సరిగానిలువక లోతుగాఇంకిపోవును. వ్రేళ్లకు అందుబాటులోనుండదు. నీరునిలువయున్నను కష్టమే. వ్రేళ్లుకుళ్లి చెట్టుచనిపోవచ్చును. కనుక కొంతఇసుకయు, మెత్తటిమన్నుకలసియున్న భూములుమంచివి. ఎఱ్ఱమన్ను, నల్లమన్నుగల భూములు చాల ఉపయోగకరములు. ఇవి సాధారణముగా డెల్టాభూములలో సంభవించుచుండును. అట్టిభూములలో చెరకువిపుగా పెరుగును. వీటికిసాయము గాలిలోకూడ కొంత తడి అత్యావశ్యకము. గాలి ఎక్కువగావీచిన గడకట్టలు నాటి చెరకుగడలు పడిపోకుండునట్లు నిలపెట్టవలసియున్నది. మంచు ప్రదేశములలో చెరకునకు కష్టముమాటిల్లును. ముక్కబాగుగా పెరుగకపోవుటయు, సూక్రోజు కొద్దిగాతయారగుటయు, తయారైనది కొంత మారిపోవుటయు సంభవించుచుండును. ఈచెరకునకు గాలిలో తడియు, ఉష్ణమునుండిన అనుకూలముగానుండును. అందుచేతనే కొన్ని సముద్రప్రాంతములయందు చెరకు విరివిగాపెరుగును. విశాఖపట్టణముజిల్లాలో చెరకు బాగుగాపెరుగుచున్నది. గోదావరి డెల్టాభూములుకూడ చాల సారవంతములైనవి. ఉత్తరమున గంగాసింధు నదులును, దక్షిణమున గోదావరి, కృష్ణా, కావేరీనదులును ఈ పంటకు చాల అనుకూలములుగానున్నవి. ఇప్పుడు తుంగభద్రా ప్రాజెక్టుకూడ కొద్దిదినములలో ఫలింపనున్నది. మనదక్కనులోకూడ ఈపంటకు ఏయాటంకమును ఇకమీదట యుండబోదు. ఇదివరకే ఈపంట చాలప్రాముఖ్యతవహింపవలసియుండెను. ఎందుచేతనన కోయంబత్తూరు చెరకులలో కొన్నింటికి నీటివసతి ఎక్కువగా నవసరములేక మెరకభూములలోకూడ ఎక్కువఫలించుచున్నది. దానికి సాయము ఇప్పుడు కాలువలు కూడ ఏర్పడిన, ఈ పంట దక్కనులో చాల అభివృద్ధిలోనికివచ్చుననుటకు సంశయములేదు. అందులకు నిజాం రాష్ట్రము ప్రభుత్వమువారు శ్రద్ధవహించుచునేయున్నారు. అచిరకాలముగా ఫలించునని నా నమ్మకము. తుంగభద్ర ప్రాంతము లీపరిశ్రమకెంతయో అనుకూలముగ నున్నవి. ఈ పరిసర భూములన్నియు కొద్దికాలములో సాగుబడియై చెరకుపంట వభివృద్ధిలోనికి తీసుకవచ్చుననుటకు సందియములేదు.

## శ్రీ కృష్ణమాచార్యులుగారిని

### ప్రపంచ మతసభకు పిలుచుట

బెజవాడ: జూను ౨౦

లండనునగరమున జరుగనున్న ప్రపంచ మతముల కాంగ్రెసు సభకు రావలసినదని బ్రహ్మశ్రీ కాశీ కృష్ణమాచార్యులుగారు ఆహ్వానింపబడిరి. కాని అనేక కారణములచేత తాము హాజరు కాజాలమనియు తమను ఆహ్వానించినందులకై వందనములనియు ఆ విశ్వమతములసభ జయప్రదము గావలెననియు కాశీ కృష్ణమాచార్యులుగారు పైకాంగ్రెసు అధికారులకు తెలియజేసిరి. అవిశ్వమత కాంగ్రెసులో సభ్యులుగ నుండగోరబడెను. అందులకు ఆచార్యులుగారు అంగీకరించిరి. "విశ్వభ్రాతృత్వము" "మతము మూలమున ప్రపంచశాంతి" అను విషయములనుగూర్చి ఒక వ్యాసరాజమును ఆసభకు సమర్పించ ఆచార్యులుగారు యుద్దేశించి యున్నారు.

# మోతీమహలు దురంతముల విచారణ

౩వ పేజి తరువాయి

## రక్షకభటుని వాఙ్మూలము

లక్ష్మయ్యయను రక్షకభటుడు ఇట్లు సప్రమాణ వాఙ్మూలము నిచ్చెను:—

సినిమాలో మోటారుల వ్యవస్థకై నేను నియమింపబడితిని. రాత్రి ౯౺ గంటలకు ఒక పెద్ద చప్పుడు వినవచ్చినది. కప్పుపైభాగము నుండి మిణుగుర్లు కనబడినవి. వెంటనే మేనేజరు గది వైపునకు పరిగెత్తితిని. అచట ఒక స్త్రీ చంకలో పిల్లనిడుకొని సహాయమునకు కేకలిడుచుండ పిల్లనందుకొంటిని. హోటలువరసింహులు సుభుజయు లమీనుండి మిద్దెకి ఎక్కించితిని. అచట ఎందరో స్త్రీలుండిరి. వాడు ఇద్దరు ముగ్గురు పిల్లలను దింపగలిగెను. అంతలో నిచ్చెనరాగా చాలామంది స్త్రీలుదిగిరి. నేనుమాత్రము పిల్లలసాపుచుంటిని. లోపలికిపోవలెనను కొంటినికాని జనసమ్మర్దమువల్ల పోజాలకుంటిని. రక్షకభటులమిద్దరమేయుంటిమి. ఇంకొకదిక్కు స్త్రీల ద్వారముకవతలనుండెను. అమీన్ సదరమీన్‌గారలు అట జూచుచుండిరి. ౧౦-౧౫ నిమిషములలో చాలమంది రక్షకభటులు వచ్చిరి. ఫైరుబ్రిగేడు (నిప్పుచల్లార్చు యంత్రము) ఎప్పుడువచ్చినది నాకు తెలియదు. అదివచ్చి ఆర్పలెను. లోనికి రాలేదు. నేనుగాని ఇంకొకరుగాని జనము నాపలేదు.

## మరియొక పోలీసు సాక్ష్యము

శివప్రసాదు [రక్షకభటుడు] సప్రమాణవాఙ్మూలమిట్లిచ్చెను:—

"నేను స్త్రీల ద్వారము కడ నియమింపబడియుంటిని. సుమారు ౯-౩౦ గం. స్త్రీలు గోల పెట్టుచు, బయటికి వచ్చుచుండిరి. వెంటనే లోపలికి వెళ్లితిని. తంతెల పై స్త్రీలు దొర్లుచుండిరి కొందరిచేయిపట్టి బయటికి లాగితిని. అంతలో అమీన్ సదరమీన్‌లు వచ్చిరి. పైన స్త్రీలు అరచుచుండ వారిని నిచ్చెన సాయమున దింపితిమి. నేను పురుషుల భాగమునకు పోలేదు. సహాయార్థము ఈలలు కొట్టుచుంటిని. నిచ్చెన ద్వారా ౩-౪ తంతెలగుండా ౭-౮ స్త్రీలు దిగుచుండ చూచితిని అంతలో నిచ్చెన విరిగెను

## వెంకటస్వామి సాక్ష్యము

వెంకటస్వామి యను ప్రేక్షకుడు సప్రమాణముగా వాఙ్మూలమిచ్చుచు నిట్లు చెప్పెను:—

"నేను ౧౦ అణాల టికెటు కొనియుంటిని. సుమారు ౯-౧౫ గంటలకు స్వల్పమెరిగించినట్టి చప్పుడు మొదలైనది. వెనుకకు తిరిగి చూడగా బొక్కుల పెట్టెనుండి జ్వాలలు కనబడెను. ప్రతివారు తనతన ప్రాణములరక్షించుకొన ద్వారము వైపు పరుగెత్తుచుండెను. రెండు నిమిషాలలో హాలంతా ఖాళియయ్యెను. రెండు నిమిషాలలో సోఫాలు చాల కాలిపోయెను. బాల్కనీ నుండి స్త్రీల ఆర్తనాదము వచ్చుచుండెను. క్రింద కొయ్యబల్ల సాయాన కొలుచుండెను. మేము స్త్రీలను క్రిందికి దుముకుమని కేకలిడితిమి. సుమారు ౩౦ మంది స్త్రీలు దుమికిరి అందు ౨ మందికి పెద్దగాయములు తగిలెను. కొందరు స్త్రీలు తమపిల్లలను క్రిందికి పారవేయుచుండిరి పడిన కొందరు స్త్రీలు అవలికి గొంపోబడిరి ఒక ఆరెండ్లపిల్ల పైన ప్రేలాడుచుండ నేను తీసికొనిపోయి అవల మోటారులో విలపించుచున్న తల్లిదండ్రులకు ఒప్పచెప్పితిని. సూఫీగారు మెట్ల వ్యవస్థనుండిరి మగలతికి నిచ్చెనగకు హాల్లో పొగనిండి, అడుగు పెట్టుటకు వీలు లేకపోయెను. తెరలు కాలుచున్నపుడు టేబిలు నదులు వెగుచుండెను హాలులో దీపములుండె. ఈవెళ్లను ౫ నిమిషములవరకుండి మిషను ఆగగానే దీపి ఆరిపోయెను మళ్లి హాలుకడకువచ్చి పురుషులుపోయి యుండ్రు" కావలెనని కేకలు వేసెను. రక్షకశాఖవారుకాని సినిమా ఉద్యోగులుకాని రక్షణవ్యవస్థజరిపిన విషయము నాకు తెలియదు

## ౫ వరోజు విచారణ

హైద్రా: ౧౮ అమర్దాదు

ముందటివలెనే నేడును సుల్తానుబజారు పెదచావిడీలో కమిషను కూర్చుండెను. కార్యక్రమము ౧౨-౪౫ నిమిషములకు ప్రారంభింపబడెను.

అంతకుపూర్వము విచారణ సంఘసభ్యులు కాలిన మోతీమహలు కుపోయి సామానుకొట్టు సుపరీక్షించిరి. కొన్ని కాలినఫిల్ములున్న పెట్టె దొరికెను. ఇదేమనియడుగ జనరలు మేనేజరులగు భగతుసింగుగారు, అందు సాగర్ కంపెనీవారి పనికిరాని సెగిటివులుండెనని సమాధానమిచ్చెను. మిస్టర్ యస్. నాయిని, (విద్యుచ్ఛక్తి నిపుణులు) మైక్రోఃస్సుడి పార్టునుండి రప్పింపబడి పరీలనలో నుండెను.

### నాయినిగారి అభిప్రాయము

మిస్టర్ నాయినిగారిట్లు వాఙ్మూలమిచ్చిరి:—

"నేను బస్ శాఖలో సీనియర్ ఇన్స్పెక్టరను. ఒక యంత్రము మంచిస్థితిలోనున్నది. రెండవదాని కొన్నిభాగములు, జ్వాలలు. పొగవల్ల చెడినవి. మాగజైనులోపల బయటిభాగములు పొగవల్ల నష్టపడినవి. మేగజైనుఫిల్ము అంటుకొనియుండినచో ఒక్కసారి ధడాలున క్రిందపడిపొయ్యెడి. ఫిల్ము బయటినుండి అంటుకొన్నది. దానిపొగచే కేబినుగోడలు పొగ చూరినవి, కేబిన్‌లో ఇద్దరాపరేటర్లు ఒక హైండరు అవసరము. ఆ హైండింగుకుయొక్క ప్రత్యేకమైన నిప్పుచేసెడని...... గది అవసరము. యంత్రము నడుపుగదిలో ఎక్కువప్రమాదము జరుగలేదు. కేబినునుండి బాల్కనీకి నిప్పంటినసంగతి తెలియదు. కేబినులోనే గొప్పప్రమాదము జరిగియుండినచో రెండుయంత్రములు తీగెలబోర్డు ఫిల్ముచుట్టలు, కొయ్యబల్ల, వెంటనే కాలిపోయ్యెవి. నేను తపాలద్వారా లండను విశ్వవిద్యాలయపు పాఠ్యక్రమమును ముగించితిని. బెంగుళూరు సైన్సుకళాశాలలోగూడా చదివితిని. నేను కలకత్తాలో మాడన్‌థియేటర్సులో ౧౧ సంవత్సరములు చలనచిత్రపు యంత్రము నడిపితిని. విద్యుచ్ఛక్తి ఇంజనీరుగా మాట్లాడుఫిల్ములో పనిచేసితిని. అందువల్ల సినిమాలవిషయము నేను నిపుణుడను. సినిమాలో సాధారణముగా రెండుయంత్రములుండును. అవసరఫిల్ము మాత్రమే కేబినులో నుంచి మిగతవాటిని పెట్టెలోనుంచబడును. ఫిల్ము ఏజన్సీలుగూడా తీనుడబ్బాలతో నేయుంచును. ఇతరఫిల్ములు పెట్టుటకు గదికావలెను. బ్రిటిషిండియా వ్యవస్థాపకులు అట్టిసమయాల్లో ప్రజాసాహాయ్యము చేయుటకు అవసరపటకరములు తెచ్చుటకు సమర్థులు. ఈకాలినఫిల్ములకే మొదట నిప్పంటియుండిన ఒకపెద్దచప్పుడై గోడలు పగిలెడివి.

సెల్యులాయిడుకట్టి కాలిన వాసనవచ్చుచున్నది. కాన సామానుకొట్టు మొదలు కాలినదని నా నమ్మకము. తర్వాత బాల్కనీ బొక్కు తగులబడినది. ఒక కాలుచున్న సిగరెట్టుగూడ యింతటి ప్రమాదము కలుగ చేయవచ్చును.

# హెచ్చరిక

## హిందూనాయకులకు సూచన

హిందూ మతపరాయణులైన మీకు సౌఖ్యమును అందజేయుచున్న శూద్రజాతికి చేరియున్నవారిని మీరు చండాలులని కపటబుద్ధిచే వ్రాసిపెట్టినారు. కొన్నిదినముల క్రిందటి పుస్తకములలో, పురాతనపుస్తకములలో యెక్కడను పంచములని కాని చండాలులని కాని లేదు. అదిగాక, కొన్ని దినములవాటలను మీ మీవ్యాదయములలో నాటించుకొని హరిజనులను అంటరానివారని దూషించుచున్నారు. ఇదిమన హిందూమతమున కెంతయో గొప్పపాపము. హరిజనులను సమసమానముగ దేవాలయములోనికి రానివ్వవలసినది. బావిలోనీళ్లు తోడనివ్వవలసినది రహదారులయందు నడువనివ్వవలసినది. ఇంతేపని మనము చేయవలసినది. తక్కిన ఆచారములన్నియు యిదివరకేవారు నేర్చుకొన్నారు, నడచుచున్నారు. లేకున్న మనహిందూమతము నశించిపోయి ఎన్ని యోకష్టముల పాలగుదుము.

ప్రస్తుతము హరిజనులందరును హిందూమతములోనుండి మనము ఇన్నికష్టముల పడుచున్నాము గాన యీమతమును వదిలివేసి యితర రెండుమతములలో యేదైనను ఒకమతములో చేరవలసినదని ప్రచారము చేయుచున్నారు. వారు ఈమతము విడిచిపోతేపోయిరి, మాబాధపోవునని తలంచి మనము నిద్రపోతిమా మన హిందూ మతము ఎన్నియోకష్టముల పాలగును. కుట్టలచెట్టుల నివాసము మనకు తప్పక రాగలదు ఇది గట్టిగానమ్మి హరిజనులను గుళ్లలోకిరానివ్వండి. బావిలోనీళ్ళు తోడనివ్వండి, రహదారులలో నడవనివ్వండి.

ఇట్లు
రాజగోపాలస్వామి

## దొంగసిద్ధాంతుల నెదుర్కొనుటెట్లు?

ఆంధ్ర వారపత్రికయొక్క ౩౯ వ సంచికలో ౧౭వ పుటలో కాశీనాథుని సుబ్రహ్మణ్యముగారు సిద్ధాంతులు యేదోనొకపంచాంగమును తీసుకొని అందుగల తిథి, వార, నక్షత్రాదులలో ఒకఘడియ తేడాతో పంచాంగమును తయారుచేసి, పైపేరు మార్చుకొనుచుండియు, ఇట్టిఅయోమయముల నిర్మూలించుటకై ప్రాజ్ఞులందరు వత్సరమున కొకపర్యాయ మొకచోట సమావేశమై పరిషత్సభను గావించవలెననియు ఒక మాసపత్రిక ప్రచురించవలయుననియు ఇంకా కొన్ని విషయములనుకూడ కలిపి వ్రాసిరి వీరియభిప్రాయము చాలాప్రశంసింపదగియున్నది ప్రాజ్ఞులందరు వారిఅభిప్రాయానుసార మొనర్చిన బాగుండుననిమన వి మా నైజాంలోకి బ్రిటిషు యిలాకానుండి కొందరు సిద్ధాంతులు బయలుదేరి, చండాలు, వశాసనములు యేర్పాటు గావించుకొని, ప్రతియూ, ఉపదివత్సరములనుండి తిరుగుచున్నారు వారు పంచాంగముల పరిశీలించిచూడ ఒకపైపేరు [ముఖపత్రమును] మాత్రమే మార్చి, కొని పంచాంగముల సిద్ధపరచినటుల కన్పట్టును వారి సులభోపాయము ఈప్రాంతపు కొందరు సిద్ధాంతులు కనిపెట్టి పంచాంగము లసిద్ధపరచి లోకోపకారము గావించుచున్నారు చూచి రా! జిల్లాకొక సిద్ధాంతియైన యుండుట పూర్వము గానుండెను ఇపుడుమాత్రముపది గ్రామముల కొకసిద్ధాంతివంతున తయారై జనుల మోసము చేయుచున్నారు, కావున ఓ నా మసిద్ధాంతులారా, న్యాయదృష్టితో విచారించుకొని జనుల మోసము చేయక, తమకు భగవంతుడిచ్చినవిద్యవలని ప్రయోజనమును బడయుదురుగాతయని మనవి. యెవ్వరైన పండితులీవిషయమును రుజువుపరచకోరినచో సంసిద్ధుడను.

ఇట్లు
బి. వెంకటరామేశ్వరశర్మ
శంకరంపేట. తా॥ అందోలు. మెదక్.

# నిజాం రాష్ట్ర మున్నూరుకాపు ద్వితీయ మహాసభ

## మున్నూరుకాపులకు రాజాబహదర్ వెంకటరామారెడ్డిగారి ప్రబోధము

### ఊరేగింపు

౨౫, జూలై ౧౯౩౬ గురువారము నాడు పగలు రెండుగంటలనుండియే సికింద్రాబాదు స్టేషనులో ప్రేక్షకులును, ప్రతినిధులును గుమిగూడసాగిరి, సరిగా మూడుగంటలకు సభాధ్యక్షులగు శ్రీ సింగంశెట్టి వెంకటస్వామి, వకీలు గారు స్టేషనుకుదయచేసిరి. స్వచ్ఛంద సేవకుల జయజయధ్వానముల మధ్య ఆహ్వానసంఘాధ్యక్షులగు పోచ్నాల రాజయ్యగారును, ఆహ్వానసంఘ సభ్యులును అధ్యక్షులవారిని పుష్పమాలాలంకృతులుగ జేసిరి. తర్వాత ఫోటో తీయబడినది. ముందు బ్యాండు మేళముతో దానివెనుక స్వచ్ఛందసేన నాయకుడు గుఱ్ఱము పైస్వారి చేయ, ఆతనివెనుక యిరువైఅయిదుమంది స్వచ్ఛందసేవకులు సైకిళ్లమీదను వీరికన్న నెక్కువమందిస్వచ్ఛసేవికలును బారులుదీరియునడచుచుండ అధ్యక్షులు కూర్చొనియున్న మోటరు కారును దానివెనుక బొంబాయి ప్రతినిధులును, ఇతరప్రముఖులుండిన "కారులు" వచ్చుచుండ యూరేగింపుబయలుదేరినది, సుమారైదువందలమంది యూరేగింపులో పాల్గొనిరి. స్టేషన్ రోడ్డు, మహంకాళీస్ట్రీటు, జనరల్ బజారులోనుండి ౪-౩౦ గంటలకూరేగింపు కళ్లప్పసత్రముకు జేరినది. దారిపొడుగున మూడు-నాలుగుచోట్ల అధ్యక్షులు పుష్పహారములతో మున్నూరుకాపు ప్రముఖులుసత్కరించిరి.

సభాస్థలమువద్ద పతాకములతోడను పచ్చని తోరణములతోడను అలంకరింపపడియుండెను పత్రికా ప్రతినిధులకును, స్త్రీలకును ప్రత్యేకవసతులేర్పరుపబడియుండెను. హాలంతయు ప్రేక్షకులతో నిండిపోయెను. స్వచ్ఛంద సేవకులు శాంతిని కాపాడుచుండిరి. పోలీసువారును సహాయపడుచుండిరి.

### మొదటి సమావేశము

సరిగా ఐదుగంటలకు జీవరక్షాప్రచారకమండలి [హైదరాబాద] హరిభజనలతో సభప్రారంభమయ్యెను. పండిత ఆదిపూడి సోమనాథరావుగారును, గొల్లకిడికీలోని బాలికాపాఠశాలాబాలికలును ప్రార్థనసలిపిరి.

రాజాబహాదరు వేంకటరామారెడ్డి, ఒ. బి. ఇ. గారీసభను ప్రారంభించుటకు వాగ్దానమొసగియుండిరి. కాని వారికికొన్ని రాజకీయములగు కారణములవలన సమయమునకు రావీలు కలుగనందున వారిసందేశమును శ్రీసురవరము ప్రతాపరెడ్డి బి. ఏ. బి. ఎల్. హైకోర్టువకీలుగారుచదివి వినిపించిరి.

ఆహ్వానసంఘాధ్యక్షుని యుపన్యాసానంతరము కంచెర్ల నారాయణస్వామిగారధ్యక్షులగుణములను బొగడుచు వారివధ్యక్షస్థానమును స్వీకరించుటకుకోరిరి. వీరిప్రతిపాదనను, టి. యస్ శెట్టిగారు బలపరచిరి. శ్రీయుత సత్తూరు (పూనాప్రతినిధులు) గారుకూడా బలపరచుచు "సామాజికరోగమును కుదుర్చుకొనుటకు జరిగినప్రథమసమావేశమునకు డాక్టరుగారొకరధ్యక్షస్థానమువహించిరి. ఇపుడో, మనలోనున్న యంతఃకలహములదీర్చుటకీ ద్వితీయ సమావేశము"న కొకవకీలుగారధ్యక్షులుగాదొరకుట యదృష్టమనిచెప్పిరి. తర్వాత కరతాళధ్వనులమధ్య శ్రీసింగంశెట్టి వెంకటస్వామిగారధ్యక్షపీఠమునలంకరించిరి. వారి యధ్యక్షోపన్యాసము జరుగుచుండ శ్రీరాజాబహాదరు వెంకటరామారెడ్డిగారును, పింగిలి వెంకటరామారెడ్డిగారును దయచేసిరి. అధ్యక్షుని ఉపన్యాసానంతరము రాజాబహాదరుగారుపన్యసించుచు నిట్లుచెప్పిరి.

#### రాజాబహాదరు వెంకటరామారెడ్డిగారి ఉపదేశములు

"నేను ఆంధ్రుడనైనను తెలుగుమాట్లాడజాలనందున చింతిలుచున్నాను. మీరందఱు సంఘటితులై యిట్టిసభలను ప్రతిసంవత్సరము చేసి మీయభివృద్ధికై ప్రయత్నించవలెను. మీ జనసంఖ్యకూడ మాయంత కొద్దికాదు. ఐనను మీలో భేదభావములున్నవని తెలిసికొని నేను చాలపరితపించితిని. మీరు మీభేదములను మరచి సరిహొన్నతికి కృషిసలుపవలెను. విద్యకై యత్నించి, బాలురనేకాక, బాలికలకుగూడ నేర్పవలెను, బాలికలే పెద్దపెరిగినతర్వాత మాతలగుదురు. వారికి చిన్నప్పుడే పెండ్లిచేసి, ఆటంకములు కల్పింపగూడదు. శారదాశాసనమునుండి తప్పించుకొనుటకు మీలోకొందరు తుల్జాభవనమునకువచ్చి పసికూనల పెండ్లిండ్లుచేయుచున్నారు. ఇట్టివి మానుకొనవలెను పునర్వివాహమునుగురించి అధ్యక్షులు తమయుపన్యాసమున సూచించియున్నారు

మన నిజామురాష్ట్రమునందుగూడ ౧౬ సంవత్సరములతర్వాత వయస్సుగలిగిన వితంతువు తిరిగి వివాహమాడవచ్చుననియు, అట్టిసంతతికి వారసత్వపు హక్కుండుననియు శాసనమంగీకరింపబడినది. త్వరలోనే యది అమలులోనికి రాగలదు.

ఇదిమాత్రమేకాక, త్రాగుడు, గంజాయి, నల్లమందు మున్నగుదురభ్యాసములు కూడా మీలో చాలాకలవు వానినన్నిటిని మానుకొనవలెను విద్యాప్రచారమువలన నిదియన్నియు తొలగగలవు స్వతంత్రముగా వ్యాపారము ఇతరవృత్తులు విద్యవలననభివృద్ధిలోనికిరాగలవు"

తరువాత అధ్యక్షులవారికోరికపై శ్రీపింగిలి వెంకటరామారెడ్డిగారుపన్యసించుచు భేదములుకూడదనియు, విద్యాభివృద్ధి చేసుకొనవలెననియు మద్యపానముకూడదనియు, పునర్వివాహములు చేయవలయుననియు ప్రతిపెద్దపనియు ఆరంభములో చిన్నదిగానేయుండెననియు, కావున అందరును ఆత్మబలంకోసం ప్రయత్నించవలెననియు, సభాశిక్షా ప్రాయములను ఆచరణలోనికి తెచ్చిననేకాని లాభముండదనియు చెప్పిరి.

తరువాత శ్రీముదిరాజ కృష్ణస్వామిగారుపన్యసించుచు నిట్లుచెప్పిరి. "రాజాబహాదరుగారు సమాజములోనున్న దోషములన్నిటిని విశదీకరించియున్నారు. నాను చెప్పినవిషయములు దక్షిణభాగరతదేశమంతకును వర్తించును. వారాంధ్రులకు శిరోమణులు కావున వారిబోధలనువిని మీ సంఘము బాగుపడవలయునని కోరుచున్నాము.

పేరులకై వివాదపడకుడు. వివాదములమూలమున ఎన్నియోనష్టములున్నవి. పురాతనకాలమునుండివచ్చుచున్న పేరునే వాడుడు. మున్నూరుకాపుపేరు చరిత్రాత్మకమైనది. కావున ఆపేరుతోనే మీరందరేకమై సంఘదురాచారములనుమాపుమాపుకొనుడు."

తరువాత అధ్యక్షునారుపన్యాసకులకు కృతజ్ఞతలర్పించినతర్వాత మొదటి సమావేశము ముగిసెను

# ఆంధ్రమహాసభాధ్యక్షుని ప్రబోధము

ప్రతినిధులకును ప్రేక్షకులకును ఆహ్వానసంఘపక్షమున ఒసలు విందులు ఏర్పాటుచేయబడినవి.

## రెండవ సమావేశము

రెండవసమావేశము ౨౬–౯–౪౫ నాడు సుమారు ౧౦ గంటలకు శీఘ్రలిపి ప్రచారకమండలివారి, హిందీతెలుగుప్రజనలు. వెంకయ్యగారి దైవప్రార్థనలతో ప్రారంభమయ్యెను.

రాజభక్తి

౧వ తీర్మానము అధ్యక్షునిచే ప్రతిపాదితమై అందరిచే ఏకగ్రీవముగా అంగీకరింపబడెను. ఆతీర్మానమిట్లుండెను.

౧ "శ్రీ ఏనమదవఏద్వర్డు చక్రవర్తి గారికిని, మహాఘనతవహించిన శ్రీనిజాము ప్రభువర్యునికిని. వారిసంతానమునకును ఎల్లప్పుడు ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగుగాకయని యీసభవారు పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు."

విద్య

విద్యనుగూర్చిన ౨వ తీర్మానమును బొజ్జం నర్సింలుగారు ప్రతిపాదించుచు "వీధిబడులున్నంతకాలము బాగుండెను. కాని ప్రభుత్వమువారివల్ల అవిమూయించబడినప్పటినుండియు నగరమువారికేగాక, జిల్లాలలోగూడా ఎంతోనష్టము కలుగుచున్నది. ప్రభుత్వమువారు చెడుతలంపుతో అగష్టిజారిచేయకుండవచ్చును. కాని ఇపుడుమనము ప్రతిమహాల్లాలోనొక్కొక్క పాఠశాల నెలకొల్పుటత్యావసరమైయున్నది. ఇదివరకు ప్రభుత్వసహాయముతోకొన్ని నడుపబడుచున్నవి. కావున కులసోదరులమందరముకలిసి ప్రతివాడలో పాఠశాల నెలకొల్పిన, మనకేగాక సర్వాంధ్రుల కుపయుక్తముగానుండు"నని చెప్పిరి.

ఈప్రతిపాదనను శ్రీయుతులు, పొన్నాల రాజయ్య. (ఆహ్వానసంఘాధ్యక్షుడు) బి.ఎస్. సెట్టి, మందాళంకరరావు (బొంబాయివాసులు) కోటిలింగంగారు బలపరచిరి. అంత తీర్మానము బహుజనాంగీకారము వడసినది. తీర్మానమిట్లుండెను.

౨"మున్నూరుకాపు సంఘమునందువిద్యావ్యాప్తికై ప్రత్యేకముగా శ్రద్ధగైకొని, ఆంధ్రబాలబాలికలకు ప్రాథమికపాఠశాలలను మాతృభాషలో విద్యనేర్పుటకై విరివిగా ప్రాథమికపాఠశాలల స్థాపింపబడుటకు కులస్థులు ప్రయత్నపడుటకు సభవారుకోరుచున్నారు."

నిర్బంధప్రారంభవిద్య

నిర్బంధప్రారంభ విద్యనుగూర్చిన తీర్మానమును ప్రవేశపెట్టుచు, ఎల్. ఎం. సత్తూరు [పూనప్రతినిధులు] గారు మనదేశంలో ప్రతిశతి ౧౮ బాలురు, ౨ బాలికలు చదువుకున్నవారున్నారు. ఇదిశోచనీయమైనసంఖ్య చూడుడు, ప్రతిస్త్రీశబ్దములో పురుషశబ్దము అంతర్లీనమైయున్నది. ఇమడియున్నది. ఉదా. She, Female, Woman. కావున బాలురవలెనే బాలికలకు అందరికి ప్రారంభవిద్యనైన నిర్బంధముచేయవలె" ననిరి.

ప్రతిపాదనను బలపరచుచు, శ్రీనారాయణరావుగారు (వీరు ఉన్నత లలితకళాపాఠశాలలను బొంబాయిలో, పూనాలో నెలకొల్పి, రెండుచోట్ల స్వయముగా నడుపుచున్నారు)

"ఈకొద్దిపాటి సంఖ్యలోగూడా చదువుకొన్నవారిలో పురుషులే అధికసంఖ్యాకులైయున్నారు. స్త్రీ సుశిక్షితురాలుకాకున్న సామాజిక, ధార్మికవిషయములందేగాక, గృహనిర్వాహణముగూడా చక్కగాచేయలేక శిక్షితులగుమన మెప్పునుబడయకున్నది. ఇదియేమన పురోభివృద్ధిచేయ ప్రవేశించుచున్న పెద్దాటంకము. బొంబాయిలో అట్లుగాక, బాలికలలో ౨౦–౨౫ ఏండ్లవరకు చదువుదురు, వలదన్న తిరుగబడుదురు, విద్యఅందరకు నిర్బంధముచేయవలసియున్నది" అనిచెప్పిరి.

తర్వాత, ఏ. బాబయ్యగారు, ఉర్దులో ఉత్సాహపూరితముగా కొంతతము వ్యక్తపరచిరి.

తర్వాత, అధ్యక్షునికోరికపై ఆంధ్రోద్యమస్థాపనాచార్యులగు శ్రీమాడపాటి హనుమంతరావుగారు కరతాళధ్వనులమధ్య వేదికనెక్కి ఇట్లుద్బోధించిరి: ఇష్టమున్నా లేకున్నా ప్రతివాడు చదువుకొనవలెను. కూర్చున్నా లేచినా, ఉన్నా, పోయినా, విద్యవచ్చినవానికి ఇబ్బందులుండవు భారతదేశములోనే, బరోడాలో ౨౫, ట్రావణకూరులో ౨౦, కొచ్చినులో ౨౩ ప్రతిశతి చదువుకున్నవారుండ మనలో ౫ గురుమాత్రమే:

పశ్చిమదేశస్థులు, ఇంతటిశక్తిమంతులగుట, ఈ ౨౦ శతాబ్దమును యంత్రయుగముగామార్చుటకు విద్యయే కారణమనిమనము గుర్తెరింగియు, మన చక్రవర్తి దేశమున నున్నట్లునిర్బంధవిద్య మనకు కావలెనని కోరవలసియున్నది: మీలో అభిప్రాయ భేదములున్నవని తెలిసినది మీరుమాత్రము వారితో వైరభావముంచక కార్యము సాగించుడు రేపైన వారిహృదయపరివర్తనము కలుగకమానదు మీరు చేయునదిఅభివందనార్హమని చెప్పుటకుఎంతో దూరమునుండిన్యయప్రయాసములకోర్చి బొంబాయిమిత్రులువచ్చుట అభిప్రాయము లిచ్చుటయే తార్కాణము ౧౨ వేలజనసమావేశమైనది సిరిసిల్లమహాసభ ఆదేఉద్యమము మొదలెంతచిన్నదిగానుండెను! కావనమీరు ధైర్యమువీడకుడు మహాసభ కొరకులకు ఆంధ్రజనసంఘపక్షమున అభినందన మందించుచున్నాను"

తర్వాత కృష్ణస్వామి ముదిరాజగారు "ఈసమస్య మున్నూరులకేకాక, దేశీయులందరికిని సంబంధించినది. విద్య పురుషులకెంత అవసరమో స్త్రీలకుగూడా అంతే. మన భారతప్రాచీన ఔన్నత్యము వీరమాతలవల్ల కలిగినదని చెప్పవచ్చును. ఝూన్సి లక్ష్మిబాయి వీరత్వము, పద్మినీబాయి, చిత్తోడులో చితిప్రవేశించుట, అహల్యాబాయి త్యాగము, మీరాబాయి,యోగమును—మరల త్రవ్వితేవలెనంటే మనము ఉత్తమమాతలను పుట్టించవలసి యున్నది, అది నిర్బంధవిద్యవల్లనే జరుగును. మనము దానికై ప్రభుత్వమును ప్రార్థించవలె"నని చెప్పిరి.

అంత తీర్మాన మేకగ్రీవముగా అంగీకరింపబడెను.

తీర్మానమిట్లుండెను.

౩ "విద్యావ్యాపనమే ప్రభుత్వమువారి యుద్దేశ్యమైనందున, దేశమునందంతట నిర్బంధ ప్రాథమిక విద్యావిధానమును అమలులోనికి దెచ్చి, బాలబాలికలకు విద్యా సౌకర్యములను గలిగించుటకై యీసభవారు ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు"

సెకండరీ విద్య మాతృభాషలో

సెకండరీ విద్యనుగూర్చిన తీర్మానము ప్రతిపాదించుచు వెంకటరామారావు బి.ఎ.,ఎల్ ఎల్.బి గారిట్లు ఉపన్యాసము గావించిరి.

"ఇంగ్లీషువాడు తన మాతృభాషయగు ఒక ఇంగ్లీషును నేర్చుకొన్నజాలు కాని, ఆంధ్రులమగు మనము ప్రాథమికవిద్య దాటినప్పటినుండి ఉర్దు, తర్వాత ఇంగ్లీషు ఇట్లా త్రిభాషా సేవ జేయుచు బి. ఏ. కడతేరేవరకు బొక్కలు తేలేటట్లు అధ్యసించేగతి పట్టుచున్నది.

౧౫ లక్షల మహమ్మదీయులు ఉస్మానియా విశ్వవిద్యాలయ పుణ్యానా ఇంగ్లీషుబారినుండి తప్పినట్లు ౭౦ లక్షల ఆంధ్రులు ఉర్దూబారినుండి ఏల తప్పగూడదు?

అయితే తుదివరకుగాక, కనీసము సెకండరీ విద్యవరకైన మాతృభాషలో చెప్పవలెను. ఏలననగా, ౪వ తరగతి కడతేరిన చిన్నబాలుడు, మొదటి ఫారములో చేరగానే చరిత్ర,భూగోళము, లెక్కలు ఇంకా ఏవేవో అన్నిటిని ఉర్దూలో బోధించిన, అర్థముచేసుకొనక తన్నులాడుట సహజము. బొంబాయి, మద్రాసు.పంజాబు మొదలగు ప్రాంతములలో మెట్రికువరకు విద్యార్థి మాతృభాషలో ప్రత్యుత్తరము లిచ్చుట కనుజ్ఞ నిచ్చియున్నారు.

అదియుగాక, మన ఆంధ్రభాష ఎంతో ఉత్కృష్టమైనది. తిక్కనవ్రాసిన ఆంధ్ర మహాభారతము, జర్మనీ భాషాంతరీకరణముకన్న ఉత్తమమైనదని. కట్టమంచి రామలింగారెడ్డిగారు సెలవిచ్చినారు. ఇంకొకవిషయము ఆంధ్రభాషా విజ్ఞానముపై మనకు వారసత్వపుహక్కుగలదు. కావున మనము అభివృద్ధికితోడ్పడనిచో మన మనుమలు మనలను తిట్టకమానరు. కావున పైరీతిగనైనా కనీసము సెకండరివిద్యకైనా మాతృభాషలో గరుపుటకు ప్రభుత్వమువారిని కోరవలయును"

తర్వాత అధ్యక్షులవారు సభానుమోదముబడసి తీర్మాన మంగీకరింపబడినదని ప్రకటించిరి.

తీర్మానమిట్లుండెను.

౪ "మాతృభాషలో విద్యగరపుటమాత్రము ప్రభుత్వానుమోదమును బొందినందున ప్రస్తుతము కనీసము సెకండరీవిద్య వఱకైనను విద్యార్థులకు మాతృభాషలో గఱపు సౌకర్యములు కల్పించుట యత్యవసరమని యీసభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు."

౫ వసతిగృహ స్థాపన

వసతిగృహ స్థాపనగూర్చిన తీర్మానమును ప్రవేశపెట్టుచు, శ్రీ పొన్నాల రాజయ్యగారు

"విద్య నేర్చుకొనుటకై జిల్లాలనుండివచ్చు విద్యార్థులయు, పరిస్థితులు చక్కగాలేని కొందరు స్థానికవిద్యార్థులయు కష్టముల బాపుటకు వసతిగృహస్థాపనకై యథోచిత సాహాయ్యమొసర్చు"డని కోరిరి.

కోటిలింగంగారు బలపరచిరి

భువనగిరి ప్రతినిధులగు జి. నర్సయ్యగారు బలపరిచినతర్వాత ఏకగ్రీవముగా తీర్మానమంగీకరింపబడెను

అదివరకే ౧–౨౪ గంటలైనందువ సమావేశమాపబడెను

భోజనానంతరము విషయ నిర్ణాయక జరిగెను సభ్యులు తమతమ అభిప్రాయముల జడియక వెలిబుచ్చుచుండిరి కావుననే చిత్తుతీర్మానములు కొన్ని రద్దుజేయుటయు, కొన్నిటి మార్పుటయు, లేనివికొన్ని తేబడుటయుజరిగినది.

తీర్మానమిట్లుండెను.

౫ "జిల్లాలలోనివసించు మనకులపుబాలులకు ఉన్నత విద్యాసౌకర్యములను గలిగించుటకై హైద్రాబాద పట్టణమున నొక వసతిగృహమును స్థాపించుట అవసరముకనుక దానిని స్థాపించుటకై వలయుధనమును విరాళముల మూలమున ప్రోగుచేయుటకు స్థాయిసంఘమున కధికారమొసగుచు కులస్థులు ఉదారభావముతో విరాళముల దయచేయుటకీసభవారు ప్రార్థించుచున్నారు."

## మూడవ సమావేశము

మహాసభ మూడవ సమావేశము, ౩ గం, ౧౫ ని,లకు జరిగినది,

ఆరంభమున అధ్యక్షులవారు ,శుభవార్త ఒకటి వినిపింతు"నని అఫులబజారులో, బాలికల పాఠశాలయొకటి, పొన్నాల రాజయ్యగారి ఆధిపత్యమున ౧౦–౧౫ రోజులలో ప్రారంభింపబడనున్న"దని ప్రకటించిరి

౬ మద్యపాన నిషేధము

మద్యపాననిషేధ తీర్మానమును ప్రతిపాదించుచు, గత మున్నూరుకాపు మహాసభాధ్యక్షులగు డా॥ తులా కనకసుందరంగారు, "మద్యపానముకన్న నీచమైనదిలేదు వైద్యశాస్త్రరీత్యా, ఈదురభ్యాసమువల్ల ౧౮ విధముల రోగములు వచ్చును పది సంవత్సరమునుండి నేను మహారాష్ట్రజిల్లాలో వైద్యవృత్తి చేయుచున్నాను అక్కడివారిలో నీదురభ్యాసము లేనందున అక్కడి రైతులు మనవారికన్న మంచిస్థితిలోనున్నారు"అని ఉద్బోధించిరి

తర్వాత. శ్రీకృష్ణస్వామి ముదిరాజుగారు,

"మీవంటి పెద్దలముందు ఇట్టి తీర్మానము పెట్టుటకు నాకే సిగ్గగుచున్నది షరాబ్ అనగా పోకిరితనము గలదనియర్థము సమాధిజాడగూడా దొరకనంతదూరానా ఈమత్తుపదార్థముల పూడ్చిపెట్టవలెను"అనిరి

తర్వాత ఫోటోగ్రాఫరు మంకయ్యగారు, మద్యపాన నష్టములను తెలుపుచు, ఉత్తరహిందూస్థానములో సత్కారముచేయుటకు పాలు తేనీరు, విడెమునిత్తురు పాలు, చల్లదుకాణములే కనబడును కాని ఇక్కడివలె కల్లుకుండలగుపడవనియు, మీరందరు నేటినుండియు త్రాగమని ప్రమాణముచేయుడనియు చెప్పిరి.

అంత తీర్మాన మంగీకరింపబడెను.ఆతీర్మానమిట్లున్నది.

తీర్మానమిట్లుండెను

"మనకులస్థులలోనెక్కువమంది మద్యపాన దురభ్యాసమునకు వశమై చెడిపోవుటచేత అట్టి దురభ్యాసమును వెంటనే వదలుకొనవలెననియు, దాని నిర్మూలనకై కులపెద్దలందరును తీవ్రప్రచారము చేయవలయుననియు కులస్థులు ప్రార్థింపబడుచున్నారు"

౭ రాత్రిపాఠశాల

రాత్రి పాఠశాలనుగూర్చిన తీర్మానము ప్రతిపాదించుచు, స్వచ్ఛంద సేవాదళ నాయకులగు కంచెర్ల నారాయణగారు, "దినమంతయు పొట్టతిప్పలుకై పోవువారికిని, ట్యూషను ఖర్చులు భరింపలేని బీదవిద్యార్థులకును, ఖాన్గి పాఠశాల అవసరము. నేను ఇపుడున్న బస్తీనివిడిచి హాజ బజారుకువచ్చి పాఠశాల స్థాపింతును, నేనుచెప్పువాడనేగాను చేసితీరెదనని ఆవేశపూరితులై చెప్పిరి. భోనగిరి నర్సయ్యగారు వీరిని బలపరుప తీర్మాన మంగీకరింపబడెను.

ఆతీర్మానమిట్లున్నది.

౭. పగలు వేర్వేరువృత్తులలోనుండు కులస్థుల సౌకర్యముకొరకై రాత్రిపాఠశాలలను [illegible]పించి అందరియందును విద్యావ్యాప[illegible] తోడ్పడ కులస్థులనీసభవారు [illegible]న్నారు.

౮. పునర్వివాహము:

పునర్వివాహపు తీర్మానము ప్ర[illegible]చు, కనకసుందరంగారు కొంత ము[illegible]రి. వీరిని శ్రీయుతులు బొజ్జం నర్సింలు, లింగముగారలు బలపరుప, తీర్మానమంగీకరింపబడెను.

తర్వాతఇద్దరు మున్నూరుబాలురు, పాశ్చాత్యవేష వ్యామోహతను హేళనపరచు సంభాషణ ౧౦ నిమిషములు జరిపిరి.

"౮ (అ) మున్నూరుకాపులలో నిదివఱకు పునర్వివాహములు "చీర-రవిక" "మారుమనుము"లను పేర జరుగుచుండు పద్ధతి శాస్త్రీయము కానందున విధ్యుక్తముగ నీట్టివివాహములను జరుపుకొనవలెనని కులస్థుల నీసభవారు కోరుచున్నారు."

౯ జీవహింస

శ్రీయుత శ్యామారావుగారు జీవహింసను గర్హించుచు నుపన్యసించి, ఇదివరకు ఖమ్మం, సిరిసిల్ల ఆంధ్రమహాసభలలో నుపన్యసించినట్లె పెద్దపెద్ద చిత్రపటములు చూపుచు నుపన్యసించిరి.

తర్వాత శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారు, జీవహింసకూడదని జాలికలిగించునట్లుపన్యసించిరి.

అంతతీర్మాన మంగీకరింపబడెను.

ఆతీర్మానమిట్లుండెను.

"౯ పవిత్రదేవాలయములందు ఉత్సవసమయములయందు చేయబడు జీవహింస నీసభవారు గర్హించుచు, సాత్త్విక పూజా విధానము నవలంబింపవలెనని కులస్థులను కోరుచున్నారు."

౭ వ పేజి చూడుడు




# గోలకొండ పత్రిక

ధాత నామ సం॥ ఆషాఢశు॥ ౧౦

సోమవారము


## ప్రభువుగారి ఉపదేశము

—o—

రాయచూరు నీటి సౌకర్యముల ప్రారంభోత్సవమును జరుపుటకు పోయినపుడు, అక్కడి పురపాలక సంఘమువారు తమకు సమర్పించుకొనిన వినతిపత్రమునకు సమాధానము నొసగుచు మహా ఘనత వహించిన మన నిజాం ప్రభువుగారు ఆఖరున ప్రజలకు చేసిన ఉపదేశము ప్రజాహితజీవనము నీరసించియున్న మనరాష్ట్రములో ప్రజా సేవకులకు క్రొత్తయుత్సాహము నొసగవలెను.

"నా ప్రియ ప్రజలారా, నా ప్రభుత్వము మీకు సమకూర్చిన సౌకర్యములవలన లాభము కలుగవచ్చునుగాని, మీరుకూడ మీ క్షేమమునకై స్వయముగ యత్నము చేయదగును." అను శ్రీవారి వాక్యము మన హిందువుల ఉపనిషత్తుల సందేశమగు "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ నిబోధత" (లెండు మేల్కొనుడు, గమ్యస్థానముచేరువరకు అలసత చెందకుడు) అను స్వయం సహాయసూత్రమును జ్ఞాపకము చేయుచున్నది. ఈ వాక్యముయొక్క భావమును ఇంకను ముందు వారు చెప్పిన "వ్యవసాయశాఖ, వాణిజ్య పరిశ్రమల శాఖ, సహకార సంఘములశాఖ మున్నగు ప్రభుత్వశాఖలు మీకు జ్ఞానమొసంగుటకే సృష్టించబడినవి — వాటిని ఉపయోగించుకొనుడు" అను వాక్యము స్పష్టము చేయుచున్నది. ఎంత దూరము చేసినను, ప్రభుత్వము వారు చేయగలది ప్రజలు అభివృద్ధి చెందుటకై యత్నించుటకు తగిన సౌకర్యములను కలుగజేయుట మాత్రమే; 'ముద్ద తెచ్చి నోటిలో పెట్టుపని' ప్రభుత్వమువారిది కాదు. మనము ఏ విధమున రా అభివృద్ధిచెందగలము అను బుద్ధి, యత్నము ప్రజలకులేనిచో ప్రభుత్వమువారి ప్రయత్నము లెన్నియైనను సమగ్రముగ సంతృప్తికరములగు ఫలితముల నీయజాలవు.

కనుక ఆత్మాభివృద్ధికై ప్రజలు ఉద్యమించవలెననియే ప్రభువుగారు కోరుచున్నారు. వ్యవసాయమును, వాణిజ్యమును వృద్ధిచెందించగోరుచున్నారు. ప్రజలు ఋణబాధనుండి విముక్తిచెందవలయునని కోరుచున్నారు, వృథావ్యయములనుండి తప్పించుకొనవలెనని కోరుచున్నారు. ఈ యత్నములనన్నిటిని వ్యక్తులు విడివిడిగ జేయవలెనే కాని, సంఘములుగ చేరి చేయరాదని ప్రభువుగారి అభిప్రాయ మెన్నటికిని కాజాలదు. ఏలనన, అందరునువిద్యావంతులైన రాజ్యములలోగూడ వ్యక్తులు విడివిడిగ ఎవరిష్టమువచ్చినట్లు వారు పనిచేయుటకంటె అందరునుకలిసి సహకార పద్ధతిపై పని చేయుటవలన క్షేమము, సౌఖ్యము యెక్కువయని అంగీకరించబడుచున్నది. అట్లుండ విద్యాహీనతచే బలహీనులైన ప్రజలుగలమన రాష్ట్రములో సహకారపద్ధతిపై ఐకమత్య బలముయొక్క ఆవశ్యకత ఎంత గలదో ఊహించవచ్చును. కనుక ప్రభువుగారి ఉపదేశప్రకారము ప్రజలు ఆత్మాభివృద్ధికిని, రాష్ట్రాభివృద్ధికిని యత్నించవలయునని నసంఘములను స్థాపించుకొనుటయు,సభలు చేయుటయు ఆవశ్యకములగుచున్నవి. ప్రభువుగారి ఉపదేశములీతీరున నుండ, ఇటీవల కరీంనగరములో జిల్లాసంఘమును (ప్రజలకు విద్యా సౌకర్యములు వైద్యసౌకర్యములు మున్నగువానిని సమకూర్పించు నుద్దేశ్యముతో) స్థాపించుటకు మననిజాం రాష్ట్ర ఆంధ్రమహాసభయొక్క స్థాయి సంఘ కార్యదర్శులు అక్కడికి పోయినపుడు ఇట్టిసంఘముల ప్రయత్నములకు తోడ్పడిన తమపైకి ఏమితప్పు వచ్చునోయని కొందరు పెద్దమనుష్యులు భయపడుట చాల విచిత్ర మనిపించుచున్నది.

మొదట ఇట్టి హృదయ దౌర్బల్యమును, కల్మషమును వదలిననేగాని, మన విద్యావంతులు మన ప్రభువుగారికి ప్రియమైన గ్రామోద్ధరణను సాధించజాలరు, మన "గ్రామ ప్రజల జీవనము అంతకంతకు ఎక్కువ సంపచ్ఛోభితము" కాజాలదు!

—

## మ. ఘ. వ. ప్రభ్వీగారికి సన్మానము

—

రాయచూరు: ౨౦ అమ

ఒకరోజాముందే వ్యవస్థలు జరిగినవి. ప్రభువుగారు, కోడుకులు, కోడండ్రతోసహా దేవస్థూరుజలాశయమును దర్శించిరి, వెంట మహారాజా బహాదరుగారుండిరి.

ప్రభ్వీగారుగూడా దేవస్థూరుకెళ్లిరి.. అచటి జలాశయము, నీరు శుభ్రపరచుట మొదలగునవి చూచిరి.

సాయంత్రం ౫½ గంటలకు రాయచూరు స్త్రీలకోరికపై వారికి అతిథిగృహమగు "మహబూబు గుల్షన్" లో దర్శనమిచ్చిరి. దర్శనార్థమైవచ్చిన స్త్రీలు ప్రాద్దేశపు లక్షణములపై దుస్తులధరించినందున చాలసంతసించిరి. పర్దా గృహనిర్వహణము, మరవవలదని బోధించిరి. సంభాషణసందర్భమున ప్రాద్దేశపుస్త్రీలు పాశ్చాత్యుల అనుకరణములో తమవేషమును మార్చుకొనుచున్నారని సెలవిచ్చిరి. తర్వాత వచ్చినవారలు నజరానాలు సమర్పించుకొనిరి. ౧౦ గంటలవేళ తిరిగి హైద్రాబాదుపోవుబండెక్కిరి

—




## నిర్మాణశాఖవారి మంజూరీలు

—

### న్యాయస్థానభవనములు

హైద్రా: ౨౩ అమ

—

మొహర్రం ౧౩౫౫ వ నాటి ప్రభువుగారి ఫర్మానుద్వారా, ఆదిలాబాదు తాలూకా న్యాయస్థాన భవననిర్మాణమునకు ౪౪ వేలు మంజూరు నివ్వనైనది.

—

### బిరుదు దొరికినందుకు సెలవు

—

అర్థశాఖ నాజముగారికి, ఓ.బి.ఇ పదవి లభించిన సంతోషమున అర్థశాఖ నాజము కార్యాలయమునకు ౨౨ అమర్దాదురోజు సెలవుండెను.

—

### నిజాంఆయుర్వేద విద్యాలయము

—

నిజాం ఆయుర్వేద సదర్ దవాఖానాయొక్క వేసవిశలవులు ముగిసినవి. అధికారులిట్లు చెల్పుచున్నారు: నిజాం ఆయుర్వేద విద్యాలయములో విద్యార్థుల చేర్చుకొనబడుచున్నారు. అమర్దాదు తుదివరకు అభ్యర్థులు చేర్చుకొనబడెదరు. కావునత్వరపడవలెను. ప్రవేశముకోరు విద్యార్థులకుసంస్కృతముతోపాటు ఏదేనిఒక దేశభాషలోగూడ మంచపరిచయముండవలెను. విద్యాలయము పనిచేయుకాలము పగలు ౧౨ ౪ గంటలు

—

### ఉద్యోగికి అప్పు

మహారాజాబహాదరుగారి ఆజ్ఞానుసారం, ఉస్మానియా విశ్వవిద్యాలయ భవన నిర్మాణములో ఎక్జిక్యూటివు ఇంజనీరులగు మహమ్మదు యూనుసుగారికి ౪౦౦౦.రూపా మోటారు అప్పు మంజూరుచేయబడినది.

—

### పింగిలి జనార్దనరెడ్డి స్మారకనిధి విద్యార్థివేతనములు

—

శ్రీ పింగిలిజనార్దనరెడ్డి స్మారకనిధి కమిటీవారు విద్యాసంవత్సరము(Academical year) ౧౯౩౬-౧౯౩౭ నకుగాను క్రిరద తెలిపిన విద్యార్థులకు వేతనములు ౨౨ వ జూన్ చేదిన మంజూరుచేసినారు.

౧. శ్రీయుత బి. రామచంద్రారెడ్డిగారికి బి. ఏజి. కోర్సుకుగాను రు ౪౫ మాసమునకు

౨. యస్. కృష్ణారెడ్డిగారికి ,, రు ౪౫

౩. ,, టి. నారాయణరెడ్డిగారికి యం.బి. బియస్. కోర్సుకుగాను ౨౫రూపాయిలు హాలిలు మాసమునకు.

౪. ,, డి. నారాయణరెడ్డిగారికి అప్పర్ సబార్డినేటు కోర్సుకుగాను ౨౦ రూపాయలుహాలీలుమాసమునకు

౫. ,, డి. నరసింహారెడ్డిగారికి యం. బి. బి. యస్. కోర్సుకుగాను ౨౫ రూపాయిలుహాలీలుమాసమునకు

౬. ,, Advanced Arts అడ్వాన్సు ఆర్ట్సు కోర్సుకుగాను ౪౦ రూపాయలహాలీలు మాసమునకు:

ఇట్లు
నృసింహారెడ్డి

—

## హైదరాబాదు సివిలుసర్వీసులో ఆంధ్రుని మొదటిజయము

—

ఈ ఏప్రిల్ ౧౯౩౬ లో జరుపబడిన హైద్రాబాదు సివిలుసర్వీసు తరగతితుదిపరీక్షకు ౬ గురువచ్చిరి. వారందరును పరీక్షలో కడతేరినట్లు హైద్రాబాదు సివిల్ సర్వీసు కమిటీవారు నిర్ణయించి ప్రకటించిరి. కడతేరినవారల పేర్లు సీనియారిటీ వరుసప్రకారము ఈక్రింద ప్రకటించబడుచున్నవి. ప్రక్కనఎవరు ఏప్రభుత్వశాఖలో చేర్చుకొనబడినది తెలుపబడినది:-

౧. ఐ. రామచంద్రరావు. బి.ఏ.,యల్ యల్. బి. [భూమ్యాదాయశాఖ]
౨. హిఫయుల్ కబీర్ ఖాన్, యం.ఏ ,యల్ యల్.బి. [న్యాయశాఖ]
౩. సయ్యద్ మహమ్మద్ కమ్రుద్దీన్, బి.ఏ... [భూమ్యాదాయశాఖ]
౪. అహమ్మద్ అబ్దుల్ జబ్బార్, బి.ఏ..... [భూమ్యాదాయశాఖ]
౫. మహమ్మద్ యాహ్యాసిద్దీకి, బి.ఏ..... [పోలీసు]
౬. అస్గర్ హుసేన్, బి. ఏ.............. [భూమ్యాదాయశాఖ]

మరియు ఐ. రామచంద్రరావుగారు తుది పరీక్షలో తప్పిపోకుండ మొదటిప్రయత్నములోనే అందరికంటె ఎక్కువమార్కులు సంపాదించినందువలన వారికి సర్ జార్జి కౌసన్ బంగారుపతకము నీయవలెనని నిర్ణయించిరి.

[ప్రభుత్వప్రకటన]

ఐ. రామచంద్రరావుగారు ఇపుడు ఉస్మానియా విద్యాపీఠ కళాశాలలో సైన్సుశాఖ నున్న ఇల్లిందల సీతారామరావుగారి సోదరులు. దేవరకొండలో జరిగిన ద్వితీయ నిజాం రాష్ట్రాంధ్ర మహాసభకు అధ్యక్షులును, ఇప్రుడు హైద్రాబాదు పురపాలక సంఘసభ్యులునగు బూర్గుల రామకృష్ణారావు బి.ఏ., ఎల్ ఎల్ బి. గారికిఅల్లుడు. వీరు ఆంధ్రులలో హైద్రాబాద్ సివిలుసర్వీసులో చేరుటకు ప్రథములైరి.

వీరిప్పుడు బాగాత్ లో అనుభవశిక్షణమును పొందుచున్నారు. మరి అయిదువారము లచట చేయుండి తరువాత వరంగల్లులో శిక్షణకుపోవుదురు. అక్కడి శిక్షణ పూర్తియైనతర్వాత బ్రిటిషిండియాలో ఒకసంవత్సరము శిక్షణపొందవలసియుండును. తర్వాత సంపూర్ణాధికారములతో తాలూక్దారుపదవి ఒసగబడగలరు.

—

## రావ ఎడ్వర్డుచక్రవర్తి జన్మదినోత్సవము

—

మన యావత్తు భారతదేశమునకిపుడు చక్రవర్తియగు రావ ఎడ్వర్డుగారి జన్మదినోత్సవము గత మంగళవారము జూను ౨౩-౧౯౩౬ నాడు ఉదయము ౭ గం. ౧౫ ని:లకు బొల్లారంలో జరుపబడినసందర్భమున ౪వ (సికింద్రాబాదు) క్యావల్రీ [గుఱ్ఱముల] బ్రిగేడులో యూనిటీకవాతు జరుపబడెను.

మ.ఘ.వ. నిజాంగారి ప్రభుత్వముయొక్క అధికారులకును, మ.ఘ.వ. నిజాంగారి సేనల అధికారులకును, వారలస్నేహితులకును కవాతుచూచుటకై ఒకఆవరణము ఏర్పరచబడెను.

[ప్రభుత్వప్రకటనశాఖ]

—

## రైల్వేలైనుపై కాపలాకాయుచున్న భటుడు యక్స్ప్రెసుక్రిందబడి చచ్చుట

ప్రభువుగారి ప్రయాణ వ్యవస్థసందర్భమున, రైల్వేలైనుపై నియోగించబడిన, రక్షకభటు నొకని ఎక్స్ప్రెస్ ౨౦ అమర్దాదు రాత్రి డీకొనినందున, తీవ్రగాయములు తగిలెను. వెంటనే ఉస్మానియా వైద్యాలయమునకు గొంపోవబడెను గాని ప్రాణము దక్కకపోయెను.

## నాటకప్రదర్శనము

నాట్యకళా ప్రవర్తకసంగీత మండలివారి "ఉమ్రాజమాన్" యను నాటకము, లాల్‌దర్వాజ దత్తమందిర సహాయార్థము ౨౫ అమర్దాదునాడు ప్రదర్శింపబడును.

## విద్యాశాఖవారు "సుబేదకన్" వార్షికసంచికను కొనుట

హోంసెక్రటరీ ప్రతిపాదనపై మహారాజా సర్ క్రిషన్‌ప్రసాదుబహదరుగారి అజ్ఞానుసారము సుబేదకన్ అను ఉర్దుదైనికపత్రిక సంవత్సరసంచిక, ౪౦౦ ప్రతులను ఒక్కొక్కటి ౧-౭-౦ ప్రతిచొప్పున ప్రభుత్వ విద్యాశాఖకొరకు కొనుటకై మంజూరుచేయబడెను.

## సుల్తానాబాదలో బ్యాంకుస్థాపన

సుల్తానాబాద: ౧౪ అమర్దాదు—౨౯ తీరు ౧౩౪౫ సుల్తానాబాదలో రెండవ తమండలాధికారి అధ్యక్షతన ఒకసభజరిగినది. అందు స్థానిక ఉద్యోగులు, న్యాయవాదులు వర్తకులు దాదాపు ౨౦౦ పాల్గొనియుండిరి. చివరకు, అచట బ్యాంకు స్థాపించవలయునను తీర్మాన మంగీకరింపబడెను. సభలోనే ౮౦౦ వాటాలు అమ్ముడుపోయెను.

## నియూర్ఖాన్‌గారు పురపాలకసంఘ సభ్యత్వమును వదలుకొనుట

...ద పురపాలకసంఘసభ్యత్వము ...నాజమగు, అలీయూర్ఖాన్‌గారు ...చ్చిరి. వీరిస్థానమున వార్డాశాఖ ...ఫజలుర్రహమానుగారు వచ్చిరి.

## ఉద్యోగ విషయములు

రాజాబహాదరు గిరిరావుగారు మరణించినప్పటినుండి, జొడిషల్ కమిటీలో వారమునకు రెండురోజులు ఎక్కువ పనిచేయుచున్నందులకు, నవాబు జుల్ఖదరుజంగు బహాదరుగారికి, రూ.౨౦౦ అలవెన్సు మహారాజాబహాదరుగారి అజ్ఞానుసారము మంజూరుచేయబడినది.

## రాకపోకలు

గా. రెసిడెంటుగారు వేసవిలో ఉదకమండలమేగియుండిరి, ౨౨ అమ. సాయంత్రము బండిలో కాచిగూడలో దిగిరి. ప్రభుత్వోద్యోగులు కొందరుస్వాగతమిచ్చిరి.

## రఘునాధమల్ బ్యాంకు మహాడవశాఖ

హైద్రా ౨౨ అమర్దాదు

ఉస్మానియా విశ్వవిద్యాలయ కార్యాలయ భవనము (అడిక్మెటు)లో రఘునాధమల్ బ్యాంకు శాఖయొకటి త్వరలో తెరవబడనున్నది.

అఫ్జలుగంజావాడలో నొకడు కందిలువల్ల కాలిపోయెను. వైద్యాలయమునకు చికిత్సార్థము గొంపోవబడెను, కాని నిష్ఫలము.

రైల్వేబస్సు సర్వీస్‌కొరకు రాజ్యములోనెక్కడనైన భూమికావలసిన, తద్విషయ నిర్ణయమునకు బాగాతు మండలాధికారిగారే తాలూకారుగా నియమింపబడిరి.

## విద్యార్థి వేతనములు

హైదరాబాదు రెడ్డిజన సంఘమువారు ౧౭-౯-౪౫ తేదిన యీక్రిందివిధముగా విద్యార్థి వేతనముల నొసంగినారు

౧ పి రామారెడ్డిగారు సిటీకాలేజి ఉపకారము రు ౧౨ (౨)బి వెంకటరెడ్డి సిటీకాలేజి ౪వఫారము రు ౧౨ (౩)ఎ శంకరరెడ్డిఉస్మానియా కాలేజి బి ఏ సీనియర్ రు౧౨ (౪) ఏ. గురునారెడ్డి సిటీకాలేజియింటర్మిడియేట సీనియర్ రు ౧౨ (౫)బి వెంకటరెడ్డి ఉస్మానియా కాలేజి ఇంటర్మిడియేటురు ౧౨ (౬)వి రామచంద్రారెడ్డి ఉస్మానియాకాలేజి యింటర్‌మీడియేటుసీనియర్ రు ౧౨ (౭)టి సత్యనారాయణరెడ్డి దారులుషఫ ౫వఫారము రు. ౧౨ (౮) పి రంగారెడ్డి చాదర్ఘాటుహైస్కూలు ౫వ ఫారము రు.౬ (౯) వై హనుమంతరెడ్డి నాంపల్లి హైస్కూలు ఉవఫారము రు. ౬ (౧౦) కే. జనార్దనరెడ్డి సిటీకాలేజి ఉవఫారము రు. ౬ [౧౧]పి.క్రిష్ణారెడ్డి నాంపల్లిహైస్కూలు ఉవఫారము రు ౬ [౧౨] బి సీతారామిరెడ్డి నాంపల్లిహైస్కూలు ౫వఫారము రు.౬ [౧౩]డి గోపాలురెడ్డి ఉస్మానియాకాలేజి బి ఎ. జూనియర్ రు.౬ [౧౪] జి. రామారెడ్డి ఖానూన్ రు౯ [౧౫] యం శివరామ రెడ్డిగారు ఉస్మానియా కాలేజి యింటర్మిడియేట్ సీనియర్ రు౯ (౧౬) ఎ శివారెడ్డి ఉస్మానియాకాలేజి యింటర్‌మీడియేట్ సీనియర్ రు౯ (౧౭) కే. గోయిందరెడ్డి ఉస్మానియా కాలేజి యింటరుమీడియేట్‌జూనియరు రు ౭ [౧౮] సీతారామిరెడ్డి నాంపల్లి హైస్కూలు ౭వఫారము రు.౬ [౧౯] కే. సత్యనారాయణరెడ్డి సిటీకాలేజీ ౫వఫారము రు. ౪ [౨౦] కే రంగారెడ్డి ఉస్మానియాకాలేజి యింటరుమీడియేటు జూనియరు రు ౪ [౨౧]క్రిష్ణారెడ్డి దారులుఉలూమ ౪వ ఫారము రు. ౪ (౨౨) సి. వెంకటరెడ్డి దారులుఉలూము ౪వ ఫారము రు.౫ (౨౩) రంగారెడ్డి చాదర్ఘాటు ౪వఫారము రు.౫ (౨౪) సి. నారాయణరెడ్డి ఆసఫియా ౫వ ఫారము రు.౪ [౨౫] ఎ. నాగిరెడ్డి ఆసఫియా ౫వఫారము రు.౪ [౨౬]బి గోయిందురెడ్డి ఉస్మానియాకాలేజి యింటరుమీడియేటు జూనియరు రు ౬ [౨౭]డి.పీరారెడ్డి దారులుఉలూం ౫వఫారమురు.౫ (౨౮) డి. లక్ష్మారెడ్డి దారులుఉలూం ౫వ ఫారము [౨౯] జి. రామారెడ్డి దారులుఉలూం ౫ వ ఫారము రు.౫ [౩౦] అండాలమ్మ ఆంధ్రబాలికల పాఠశాల ౭వఫారం రు.౪ [౩౧] కమలబాయి ఆంధ్రబాలికల పాఠశాల ౩వ ఫారం [౩౨] సత్యమ్మ ఆంధ్రబాలికలపాఠశాల ౩ వ తరగతి రు.౬

## రాకపోకలసవరణ

(౧౩)వ సంచిక గోల్కొండపత్రికలోని (౭)వ పుటయందు రాకపోకల శీర్షికలోఅచ్చుపడినవారలో నొకభాగము సత్యదూరముగానున్నది. అర్థమైనను సరిగాస్ఫురించుటలేదు. మొహమ్మదుఖాసిము సాహెబు అనేవ్యక్తి తణుకువాస్తవ్యులనియు, ఇటీవలవీరుప్రభుత్వప్రకటనశాఖలో తాత్కాలికంగా గుమాస్తా పనిమీదనుండి. ఓవప కాలపరిమితిపూర్తి కావడముచేత వెళ్లిపోయినారని ప్రకటింపబడినది మొహమ్మదుఖాసిముఖాన్‌గారు తణుకువాస్తవ్యులుకారు. వారిది ఏలూరు. తూర్పుగోదావరి జిల్లాఆక్కడనే విద్యాభ్యాసమై బి.ఏ అవస్థలో ఉత్తీర్ణులైనపిదప ఇటీవల హైద్రాబాదనే తమనివాసముగా ఏర్పరచవచ్చియున్నారు వీరువెళ్లిపోలేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయములో ప్రస్తుతము ఏర్పడిన తెనుగు సహాయ ఉపాధ్యాయ పదవికొరకు ప్రయత్నించుచున్నటున్ను,విద్యాశాఖలోను, సహకారశాఖలోను ఉద్యోగముకొరకు ప్రయత్నముచేయుచున్నట్లు తెలిసినది.



## నిజాం రాష్ట్రమునకుక్రొత్త ఆంధ్ర దినపత్రిక

శ్రీయుత గోలకొండ పత్రికా సంపాదకుల గారికి

అషాఢ శు॥ ౭ శనివారమునాటి ఆంధ్రపత్రికలో "నిజాంరాష్ట్రమునందు ఆంధ్ర దైనిక పత్రిక" అను శీర్షిక్రింద హైద్రాబాదులోని ఆంధ్రపత్రిక స్వకీయవిలేఖరి వ్రాసిన వార్తలో యేమాత్రము సత్యంలేదు. ౨౯ జూను, అనగా యీ తారీఖువరకు నేను పత్రికా ప్రచురణకు అనుమతిగోరుచు నైజాం ప్రభుత్వమువారికి దరఖాస్తు పెట్టియుండలేదు. ఇట్టి సందర్భములో "అనుమతిలభించిన"దనియు మరియు "అక్టోబరునెలలో ప్రచురించుటకు ప్రయత్నించుచున్నారు" అనియు వార్త నిజముకాదు

కనుక తాముదయచేసి యీలేఖ మీపత్రికలో ప్రచురించగలరు.

తే. ౨౯-౬-౩౬ } ఇట్లు విధేయుడు
మం నరసింగరావు

ఆంధ్రపత్రికలోవార్త ఈక్రిందివిధముగానున్నది

హైదరాబాదు, జూను ౨౨

"నిజాంరాష్ట్రాంధ్రనాయకులును,"రయ్యతు"అను ఉర్దూజాతీయవారపత్రికా సంపాదకులునునగు శ్రీయుత మందుముల నరసింగరావుగారు ఆంధ్రదైనిక పత్రికను ప్రకటింప నిశ్చయించుకొనినట్లు రూఢిగా తెలియుచున్నది. శ్రీ నరసింగరావుగారు పత్రికను అక్టోబరునెలలో ప్రచురించుటకు ప్రయత్నించుచున్నారు నైజాం ప్రభుత్వమువారిచే పత్రికా ప్రచురణకు అనుమతియు లభించినదని తెలియుచున్నది.

సుమారు తొబ్బదియైదులక్షల ఆంధ్రులుగల నిజాంరాష్ట్రమునందిపుడు "గోలకొండ"అర్థవారపత్రిక యొకటిమాత్రము ఆంధ్రమునందు ప్రకటింపబడుచున్నది కొంతకాలమునకు పూర్వము ఆంధ్రప్రముఖులగు కొందరు పత్రికా ప్రచురణమునకై అనుమతి నొసగ ప్రభుత్వమువారిని కోరియుండిరి. కాని అనుమతి ప్రసాదింపబడలేదు."

## ఆంధ్ర సోదరీ సమాజము నాటక ప్రదర్శనము

ఆంధ్రసోదరీ సమాజపక్షమున జూన్ ౨౦వతేది శనివారము సాయంత్ర మారుగంటలకు బొగ్గులకుంటయందుండు వెస్లియన్ హాలునందు "ఆంధ్రభాలికా సమాజము"వారు (నారాయణగూడెము నివాసులగు బాలికలు) భక్తిరస ప్రబోధకమగు ధ్రువ విజయమను నాటకమును ప్రదర్శించిరి. ఈనాటకమును బాలికలకు నేర్పినవారు, సికింద్రాబాదునందు సరస్వతీనాటక సభాస్థాపకులును, గానవిశారదులునునగు శ్రీయుత రత్నము నాయుడుగారు వీరు రలువేలో నూరురూప్యముల వేతనముగల యుద్యోగులు తమ నాటకసమాజముక్క పరదాలు, విగులు, నగలు, దుస్తులు, మొదలగునవన్నియు తెప్పించిరి. ఆసభకుచేరినవారే హారుమోనియము తబలాలు వాయించిన మాష్టర్లు అందరును గౌరవ కార్యనిర్వాహకులే. ప్రేక్షకులలో ౨౦౦ లకుమించిన స్త్రీలును, కొందరు పురుషులును మాత్రము సభ నలంకరించియుండిరి. బాలికలు చక్కగా తమతమపాత్రలను నైపుణ్యముతో నిర్వహించి సభ్యులనానందపజేసిరి. శ్రీయుత రత్నము నాయుడుగారు తమ నైపుణ్యమును యిదివరకు సికింద్రాబాదునందు మాత్రమే వెల్లడి జేసియుండిరిగాని, యిప్పుడు హైదరాబాదునందును కీర్తినిగాంచిరి. ఆంధ్రబాలికా సమాజపు బాలిక లెండకాలపు సెలవులలో తమపాఠ్యులను బాగుగనభ్యసించి యిపుడు మనోహరముగా ప్రదర్శించిరి. నాటకాంతమున వెస్లీహాలు యధికారులకును, రత్నము నాయుడుగారికిని. కృతజ్ఞతావందనము లర్పింపబడి నటవరాంద్రగు బాలికలు కొనియాడబడిరి. ఈ ధ్రువవిజయమను నాటకమును కొద్దికాలములో ప్రదర్శించుటకు వీలుగానుండునట్లును, సంగ్రహముగా సులభశైలిని రచించినవారు శ్రీయుత వేణుగోపాలస్వామి నాయుడుగారు. వీరు సరస్వతీసభలోని సభ్యులు. వీరును వందనీయులే.

నడింపల్లి, సుందరమ్మ.

## హరిజన సేవక సంఘము యొక్క క్రొత్త విధానము

ఇటీవల కెంగేరిలో జరిగిన దక్షిణ భారత హరిజనసేవక మహాసభకు గాంధిమహాత్ముడు ప్రారంభోత్సవము సలుపు సందర్భమున హరిజనసేవ రాజకీయముకాదనియు, దీనియందు మతలక్షణమే ప్రధానమనియు నిరూపించుచు దీర్ఘోపన్యాసము గావించిరి. హరిజన సేవక సంఘమనగా హరిజనులను అంటరానివారినిగ అణగియుంచిన పాపిష్ఠుల సంఘమనియు ఈ సంఘములో ఒకరినొకరిని బంధించునదితత్పాప నివారణార్థమై చేయబడు సేవయనియు చెప్పిరి. "హరిజనులు ఇతర మతములలో చేరుట తప్పదు. కొట్టి మనము తొందరపడునో, మన ఉద్యమము యొక్క మతలక్షణమంతయు పోయినట్లే" అనిరి. "మన పాప పరిహారార్థమై హరిజనులను దేవాలయములలోనికి రానీయవలెను. హిందూమతమునుండి ఒక్కరు తప్ప తక్కినవారందరును లేచిపోయినను నాకదే అభిప్రాయము. మన ఉద్దేశ్యము పాపపరిహారమే గాని రాజకీయముగాదు." అనిరి. మరల హిందూమతములోనికి రాదలచిన వారలకు శుద్ధిచేయుట అవసరమా అను ప్రశ్నకు గాంధిగారు అది అనవసరమనియు, మతములన్నియు ఒకటేననియు చెప్పిరి. కాని హరిజనసేవక సంఘములోనివారలు ఇతరమతములలో చేరియున్నవారలను తిరిగి హిందూ మతములోనికి రానీయ వలసినదను ప్రచారము చేయరాదనిరి. తిరిగి ఇతర మతములనుండి హిందూ మతములో చేరినవారు పేరుమార్చుకొనవలెనా అని ప్రశ్నించగా, గాంధిగారు "పేరులోనేమున్నది? క్రైస్తవ నామమైననుసరే, ముసల్మాను నామమైననుసరే నాకేమియు భేదమగుపడదు

* * *

ఇదివరకు హరిజన సేవకసంఘమువారు హరిజనుల సౌఖ్యముల నొనగూర్చుకార్యములలో మగ్నులైయుండిరి. ఇప్పుడు వేర్వేరుప్రాంతములకు ప్రత్యేకములైన కష్టములను ఉదాహరణార్థము తమిళదేశములో నాటాకీసమస్య, హైదరాబాదుసంస్థానములో బేగారి మున్నగునట్టివి —నిర్మూలించుటకై యత్నించదలచిరి.

## ఆంధ్ర పట్టభద్రులకు విందు

నిన్న సాయంకాలము హైద్రాబాదునగరములో శ్రీయుత కొండా వెంకటరంగారెడ్డి, హైకోర్టువకీలు గారింటియందు, ఇటీవలజరిగిన ఉస్మానియావిద్యాపీఠపరీక్షయందు కడతేరిన ఆంధ్రయువకుల అభినందనార్థము ఒకచిన్న అల్పాహారవ్రుందుగు జరిగెను. ఈవిందుకు సుమారు ౫౦-౬౦ మందివచ్చిరి. ౬౺-౭ గంటలకు విందుపూర్తి కాగానే అందరును ఇష్టాగోష్ఠిగ సమావేశమైరి. అభినందించ బడుచున్న ఆంధ్రయువకులలో యల్ యల్. బి. పరీక్షలో కడతేరి, న్యాయవాదివృత్తి నవలంబించబోవుచున్న నందగిరివెంకట్రావుగారు, వెంకట్రాంరావుగారు మున్నగు అయిదుగురుగలరు. శ్రీయుత కొండా వెంకటరంగారెడ్డిగారు న్యాయవాదివృత్తిలో అభివృద్ధి పొందగల్గుటకు ఎట్టిగుణములవసరమో బోధించిరి. ఇప్పుడు క్రొత్తగావెలువడినవారలు నగరములో మంచిఅనుభవశిక్షణముపొంది జిల్లాలలో చేరివృత్తి సాగించుటఅవసరమనిసూచించిరి. పిమ్మట దామోదరరెడ్డిగారు పతేమరుతోచిన సలహాలనొసంగుచు ముఖ్యముగ వకీలుజడ్జియొక్క హృదయమునుకనుగొని వర్తించదగుననిరి. తర్వాత కోదండరామారావుగారు, న్యాయవాదివృత్తికి నగరములోనుండిననే ఎక్కువ లాభమనిరి. శ్రీయుత మాడపాటిహనుమంతరావుగారును తమఅనుభవములనుచెప్పి, న్యాయవాదులు తమస్వతంత్రవృత్తికి తగినట్లు ఖానూను తెలిసినదానికి తేదినట్లుపిరికితనమువదలి మెలగవలెననిరి. వడ్లకొండనరసింహారావుగారు వారకొంత వర్తకుడు, వైద్యుడు, వకీలు-వీరందరి వృత్తికిని ఆడంబరము ముఖ్యమనిప్రారంభించి, చెప్పిచెప్పి, తుదకువకీలువృత్తిలో ఫీజునుప్రధానముగ చూచుకొనరాదనియు, ఫీజువచ్చినను రాకున్నను కక్షిదారుని గౌరవముతో చూచుచు అతనివ్యవహారమును సంరక్షించుటకై ఫీజు ముందుగా ఇచ్చినప్పుడెంత శ్రద్ధతోయత్నింతురో అంతశ్రద్ధతో యత్నించవలెననిరి.

వెంకట్రాంరావుగారు సలహాలనొసంగినవారలకు కృతజ్ఞతచెలిపి, న్యాయవాదివృత్తి ధర్మరక్షణ ప్రధానముగాక ఖానూనురక్షణ ప్రధానమని వించినచో వృత్తినిగూర్చిన వీరభిప్రాయములన్నియు పోవుననిరి. రాత్రి ౯ గంటలకు సమాప్తమయ్యెను.

## బజారు ధరలు
## దడువైరామనుగారు

(హైద్రాబాదు ఉస్మానుగంజు)

౨౮-౯-౧౩౪౮ ఫ. ఆదివారము

| | | పల్లా 1కి రు. అ. ప |
|---|---|---|
| బక్షీ గోధుమలు | .. | ౧౫-౧౬ |
| గోధుమలు జెలాల్యా మొ॥ | ,, | -౧౮౪ |
| బియ్యముదొడ్డువి క్రొ॥మొ॥ | ,, | ౧౨౪-౧౩ |
| ,, నావకరాలు క్రొత్తవి | ,, | ౧౩-౧౮ |
| ,, నావకరాలు పాతవి | ,, | ౧౭-౧౭౪ |
| ,, కొశిచోడీలు | ,, | ౧౭౪-౧౭ |
| ,, కిచిసాంబారులుకొత్తవి | ,, | ౧౬౹-౧౬౪ |
| ,, రామసాగరాలుకొత్తవి | ,, | ౧౮-౧౮౹ |
| ,, డిటో పా॥ | ,, | ౧౮౪౹-౧౫ |
| ,, పిచోడీలు | ,, | ౩౦-౩౫ |
| ,, అమర్ సర్ సన్నబియ్యం | ,, | ౩౫-౪౦ |
| ,, మోతిచూరు బియ్యం | ,, | ౩౫-౩౬ |
| కందులు పెద్దవి | ,, | ౯-౯౹ |
| కందిపప్పు పెద్ద | , | ౧౩-౧౮ |
| పచ్చపెసలు | ,, | ౧౦-౧౦౹ |

| | | |
|---|---|---|
| పెసరపప్పు | ,, | ౧౫-౧౬ |
| నల్లపెసలు | , | ౭౹-౭౪ |
| మినుములు | ,, | ౯౹-౯౪ |
| మినప పప్పు | ,, | ౧౮౪-౧౫ |
| ఉలవలు | ,, | ౬౪౭-౪ |
| జొన్నలు | ,, | ౯-౧౦ |
| కిరి సెనగలు | ,, | ౧౨౪-౧౩ |
| సెనగలు కొత్తవి | ,, | ౧౧-౧౧౭ |
| పుప్పు | ,, | ౧౨౪-౧౨౪ |
| తవుడు | .. | ౨౪-౩ |
| పత్తిగింజలు | ,, | ౭-౭౹ |
| అలచందలు | ,, | ౯-౯౹ |
| ఆనుములు | ,, | ౭౪-౭ |
| బటానీలు | ,, | ౭౪-౯ |
| తెల్లనువ్వులు | ,, | ౨౩-౨౮ |
| బెల్లము | ,, | ౧౦-౧౦౪ |
| ఎఱ్ఱ చక్కెర | . | ౧౫-౧౬ |
| తెల్ల చక్కెర | .. | ౧౩-౧౩౹ |
| పేరుసెనగ చిన్నవి | ,, | ౧౭౪-౧౯ |
| పసుపు | . | ౧౨-౧౩ |
| మిరప కాయలు | .. | ౧౫-౨౦ |
| చింతపండు క్రొ॥ మొ॥ | . | ౨౦-౨౧ |
| అల్లం 12సేర్లకు మొదలు | | ౮-౮౹ |

# గోలకొండపత్రిక చేసిన సేవ

(11 వ సంవత్సరాది సంచిక

ప్రజలసర్వతోముఖాభివృద్ధి కుపకరించు విషయములను దెలుపుటయే తమ యుద్దేశ్యమని సంపాదకులే తమ ప్రస్తావనలో వ్రాసియున్నారు. వీరుతమయుద్దేశ్యమును చక్కగా నెరవేర్చినందుకు అభినందించవలసియున్నది. కేవలము నైజాములోని ఆంధ్రులకేగాక దేశములోని ఇతర ప్రాంతములందలి ఆంధ్రులకు సైతము పయోగింపగల రాజకీయ ఆర్థిక సాంఘిక చారిత్రిక సాహిత్యసంబంధ విషయములనుగూర్చిన వ్యాసములు నిజము సులభశైలిలో వ్రాయబడినవి.

వ్యాసములు వ్రాసినవారిలో నిరువురు ఆంధ్రనారీమణులుండుట శుభప్రదము. స్త్రీ చెడిపోయే పదార్థమా? అను వ్యాసమున భారతదేశముయొక్క నీతినియమములందు వ్రతములందు ఆచారధర్మములందును స్త్రీ చెడిపోయే పదార్థమను అభిప్రాయముతోనే అనేకములగు అన్యాయపు కట్టుబాటులు చేయబడినట్లు కనబడుచున్నదని శ్రీమతి యెల్లాప్రగడ సీతాకుమారిగారు వ్రాయుచు వివాహము. విద్య. పాతివ్రత్యం, పునర్వివాహము విడాకులు నాటకరంగం వీనియందు స్త్రీలకుగల కష్టసుఖములనుగూర్చి నిర్భయముగా వ్రాసినారు. హిందూశాస్త్రమంతే స్త్రీ స్థానము అను వ్యాసమున సురవరము ప్రతాపరెడ్డి బి. ఏ. బి యల్. గారు అవిషయమునగూర్చిన హిందూధర్మశాస్త్రమును చర్చించినారు. ఆధునికరాజకీయమములు అను వ్యాసమున పసుమాలన్రుశింహాశర్మ బి.ఎ ఎల్ ఎల్, బి. గారు ఆధునిక రాజ్యాంగముల నుగూర్చి చక్కని వ్యాసము వ్రాసినారు. అయితే వీరు క్రొత్తపారిభాషికపదములను విరివిగా వాడక సామాన్యముగా పత్రికలందు వాడు పదములనే ఉపయోగించిన బాగు

... కపాటి హనుమంతరావుగారు ప్రజల భాషలో న్యాయవిచారణ అనునది చాల చక్కగానున్నది. శ్రీయుతపింగళి వెంకట రామారెడ్డిగారి దేశముఖుశేశపాండ్యాలచరిత్రిఅనువ్యాసము శ్రీయుతవెంకటరంగారెడ్డిగారిమాల్గుజారిపద్ధతిలోనికొన్ని యిబ్బందులుఅనువ్యాసము నైజాంరాజ్యసమస్యలకు సంబంధించినవి. ఇండియన్ ఫెడరేషను స్వదేశసంస్థానములనుగూర్చియు పయోజనవిద్య కర్నాటకదేశము స్వచ్ఛందసేవకోద్యమము పశుసంరక్షణ, అస్పృశ్యతమున్నగువానినిగూర్చినవ్యాసములును బాగుగనేయున్నవి. ఇందలి పద్యరచనలలోని తలమానికము శ్రీయుత రాయప్రోలు సుబ్బారావుగారి ,, తెనుగుమాన్యము,, ,,తంజావూరు నాయిక రాజాస్థాన కవయిత్రిలు కొండఱు,, అను అమూల్యవ్యాసమున శ్రీయుత కుడుగంటి సీతారామయ్య ఎం.ఎ. గారు తంజావూరుగ్రంథాలయమునతాము చేసినపరిశ్రమ ఫలముగా ఆంధ్రులు గర్వపడతగిన చరిత్రాంశములను గ్రంధరచనా విశేషములను తెలిపినారు.

ఈసంచికలో చేర్చబడిన చిన్నకథలు రెండును సామాన్యముగా రైళ్లలో అమ్మబడు మాసపత్రికలందు వ్రాయబడువాటికన్న మిన్నలని చెప్పుటకు వీలులేదు.

ఈసంచికయందు చేర్చబడిన చిత్రపటములందు నైజాము రాజకుటుంబ చిత్రములతోపాటు జాతీయనాయకుల పటములుగూడకలవు.

మొత్తముమీద నీసంచిక చాలా చక్కగానున్నదని చెప్పుటకు సంతసించుచున్నాము.

—గోష్ఠి

# తిరువాన్కూరు ప్రభువుకు దేవాలయాధికారము

పరరాష్ట్రీయులగు వైదికుల సలహా సంఘము

నింగేరిలో హరిజన సేవకుల మహాసభలో ప్రస్తుతము దేశమును కలవరపెట్టుచున్న సమస్యయగు హరిజనుల అన్యమత స్వీకారమును గూర్చి విశేషముగ ఆలోచించిరి. అందు హిందూ మతేతరములలో చేరవలెనను ఇఝువాల ప్రతినిధియగు కే. ఆర్. విశ్వంభరన్ గారు ఇఝువాలువిద్యలో మంచి అభ్యున్నతిగాంచుచున్నారనియు, వారలు ఆర్థికస్థితిలోగూడఇతరులకంటె తక్కువవారు కారనియు చెప్పి, "మాకు తక్కినవారలతో సమానముగ గౌరవము చేయని సంఘములో నుండుటకు మా ఆత్మగౌరవబుద్ధి ఎంతమాత్రము ఒప్పుటలేదు" అనిరి. ఇతరమతములో చేరవలెనను ఆందోళనకు ఇంతకంటె వేరేకారణము లేదనిరి. ఇఝువాలలో నొకరును తిరువాన్కూరు జడ్జిగా పని చేసియుండినవారునగు యం. గోవిందన్ గారు ఇప్పుడు ఇఝువాలపరిస్థితులను గూర్చి విపులముగ నుపన్యసించిరి, తమకాలమువారికిసొంతముగా నూటికంటె ఎక్కువ దేవాలయములు గలవనియు అవి పరిశుభ్రముగ నుండుననియు అదేవాలయములలో తమకులమువారలే అర్చకులనియు వారు చెప్పిరి. ఇట్టివారలను ఇతర దేవాలయములలోనికి ఎందుకురానీయరాదు? తిరువాన్కూరులో మహారాజావారు దేవాలయములన్నిటికిని సర్వాధికారి. మన్రోకాలములో దివానుగా నున్నపుడు వారు సంస్థానప్రభుత్వపు ఖర్చులపై దేవాలయములన్నిటిని వశపరచుకొనియుండిరి. వారికే మతవిషయములలో సలహాలనుజెప్పుటకు తిరువాన్కూరు పౌరులుకాని అర్గురు వైదికబ్రాహ్మణులున్నారు. మహారాజుగారు తలచినచో, దేవాలయములలోకి అందరిని సమానముగ రానిచ్చుటకు ఎవరును, తుదకు తిరువాన్కూరుసంస్థాన పరిషత్తు లేమియు తెలియని ఆ వైదికోపదేశకులును ఆటంకపెట్టజాలరు. ఇది వరకొకప్పుడు ఇంగ్లాండుకు [సీమకు] పోయివచ్చినవారలు దేవాలయములలోకి రానీయబడకుండిరి—కాని గొప్పగొప్ప పలుకుబడి గలవారలు, తర్వాత మహారాజుగారుకూడ ఇంగ్లాండునకు పోయివచ్చినతర్వాత ఆ వైదికోపదేశకులు అట్టివారలను దేవాలయములలోకి పోనిచ్చుటకు అంగీకరించిరి.

మహారాజు ఇటీవల హరిజనులను క్రైస్తవులను ముసల్మానులను రానిచ్చు ప్రతిచోటికిని రానీయవచ్చునని ఆజ్ఞాపించిరి. ఈఆజ్ఞ హరిజనులను క్రైస్తవులతోను, ముసల్మానులతోను కలిపివేయుట విచిత్రము.

ఇక హిందూమతమునువదలి ఇతరమతములలో చేరవలెననుపిచ్చి నిఖండించుచు గోవిందన్ గారు "ఆర్థికకారణములచే హిందూమతమునుండి పారిపోజూచుట పిరికితనము గొడుగులో ఒకగిన్నెడునీరు నిలువదనుకారణముచే గొడుగును దూషించుటవలెనున్నది అదంతయు "విశ్వాసమునకు సంబంధించినది. హిందూమతము అన్నిమార్గములను ఆమోదించునదై నిర్బంధములేనిమతము కాన ఈవిశాలమతమే నాకు తక్కినమతములకంటె ఇష్టము.

గోవిందన్ గారిని అనేకప్రశ్నలడిగిరి, "ఇఝువదేవాలయములలోనికి ఇతరసవర్ణులను రానిచ్చుచున్నరా?" అవియడుగ, గోవిందన్ గారు, "నారాయణగురువుగారి హయాములో స్థాపించబడిన దేవాలయములలో వర్ణభేదము లేదు కాని దేవాలయములలో భిన్నముగను ండవచ్చును. కాని ఎక్కువఅభివృద్ధిలోనుండుసవర్ణులు తమకంటె హీనస్థితిలోనున్నవారలకు ఉదాహరణము చూపరాదా?

తుదకుగోవిందన్ గారు ఈ "మాట ఇఝువాలసభలో చెప్పను లెండి" అనగానే అందరును నవ్విరి.

# వైస్రాయిగారి క్షీరదాన విధానము

స్వరలోనే ఏవలుకోవలెనని చెప్పునని సి. రాజగోపాలాచారి గారి అభిప్రాయము

క్రొత్తవైస్రాయి లిన్లిత్గోగారు దేశములోని కర్షకులకు అందరకిని సద్వృషభ సాంబరవోషకుని వ్యు చేయవలెనను. అవిషయముపై శ్రద్ధవహించుచున్నట్లు పత్రికలలో కానవచ్చినవార్తలను గూర్చి సి. రాజగోపాలాచారిగారి అభిప్రాయమును కనుగొనుటకై ఒకవాడు సండేప్లైమ్సుయొక్క ప్రతినిధి వారితో సంభాషించెను.

మొదట సామాన్యముగా అభిప్రాయము చెల్పుడని అడుగగా జవాబురావందున, వైస్రాయిగారి క్షీరక్రొత్త విధానమునుగూర్చిన ప్రబోధము దేశీయులదృష్టిని స్వరాజ్యాందోళన నుండి మరల్పబాయని ప్రతినిధి అడిగెను. అప్పుడు ఆచారిగారు లిన్లిత్గోగారిని ప్రతి భారతీయ కర్షకునికిని ఒకజత మంచి ఎద్దులను ప్రతి శిశువునికును మంచిపాలను లభించునట్లుచేయు విధానము ననుసరించనిండు. అది విజయవంతమైనచో, మేము గాంధిమహాత్మునివదలి, వారినేమా ముక్తిప్రదునిగ భావింతము....లిన్లిత్గోగారు మన రైతులలో సగముమందికి మంచిపశువులనిచ్చిన; మనశిశువులలో సగముమందికిమంచిపాలనిచ్చినచో నేను సంతృప్తిజెందెద. దేవతలను మార్చుకొనుటకు సలహానిత్తును.

"క్రొత్తకాలములోనే వైస్రాయిగారు ఈ పిచ్చినెనను వదలవలసి యుండును. లేదా కాంగ్రెసులో నైనను చేరవలసియుండును. లిన్లిత్ గోగారు పిల్లలకు కావలసిన పాలను రైతులకు కావలసిన ఎద్దులను ఇవ్వగలిగినప్పటికి, వారు రాజ్యాంగమునే మార్చి, మనమడుగు స్వరాజ్యమును ఇచ్చినవారగుచున్నారు.

"భారతీయ కర్షకునికి రెండెద్దులైనను లేకుండపోవుటకు కారణమేమి? అతడు తన పశువులనమ్మి, వచ్చినడబ్బును సిపాయీలను పోషించుటకు ఇవ్వదలచినాడా?"

ఆచారిగారిట్లు అడుగగా, పత్రికా ప్రతినిధి "ఏసిపాయీలు?" అని అడిగెను. ఆచారిగారిట్లు చెప్పదొడగిరి: "సామ్రాజ్యమునకు ఎవరైననుశత్రువులున్నచో శత్రువులతో యుద్ధము చేయుటకు, భారతదేశములో సేనఉండవలెను గదా? భారతీయ వ్యవసాయకునికే మంచి జాతి ఎద్దులకు హీనజాతులవాటికిని భేదము తెలియకున్నదా? లేక అతడు తనకు కావలసినన్నిటికంటె ఎక్కువ కుక్కలను నుంచుకొని, ఆహార పదార్థములను వ్యర్థముజేయుచు, ఎద్దులకు తిండి లేకుండ చేయుచున్నాడా?"

"మరి అప్పిచ్చువాని మాట యేమి?" అని పత్రిక ప్రతినిధి అడిగెను.

రాజగోపాలాచారిగారు ఇట్లు సమాధానమిచ్చిరి:

"అవును. సాహుకారుపశువులను తీసికొనివాడు, భూమినిగూడాతీసికొందునని బెదరించుచున్నాడు సరే, మంచిది. వ్యవసాయికులకు అప్పిచ్చి కొతసమయములో దానిని రాబట్టుకొను బ్యాంకులు ఏలఉండరాదు? ఇంపీరియల్ బ్యాంకు ఏమిచేయుచున్నది. అక్కడిపగను వ్యవసాయకులకెందుకు ఉపయోగించరాదు! లిన్లిత్ గోగారు ఈమాటఅడిగినచో. బ్యాంకుకారులు వ్యవసాయకునికి పరపతిలేదందురు. అదెందువలన? ఈప్రకారముగ విచారించుచుపోయినచో తుదకు విదేశీయుల పాలనచే ఇక్కడిజనుల ఆస్తిపాస్తులన్నియు తారుమారైనవను ఒక్కకారణముతప్ప మరేమియుగోచరించదు"

మీరు సైన్యముపై చేయబడుఖర్చును గూర్చియు, ఎక్కువపన్నుభారమును గూర్చియు చెప్పుచున్నారు" అని ప్రతినిధిఅవగా ఆచారిగారు జాననుచు "అంతేకాదు. సివిల్ సర్వీసుపై ఖర్చుగూడ నాగరిక ప్రపంచములో తక్కిన రాజ్యములన్నిటిలోకంటె గొప్పది" అనిచెప్పిరి.

శిశువులకు సరియైనఆహారము, పాలసమస్యనుగూర్చి ప్రతినిథిఅడుగ రాజగోపాలాచారిగారిట్లుచెప్పిరి: "మిత్రుడా, అది పుష్టికరాహారశాస్త్రపద్ధతిగాదు. బిడ్డలు పాలు లేకుండ ఎందుకుండవలెను? మనదేశములో తల్లులుబిడ్డలను ప్రేమించుట మానుకొనిరా! లేక పాలు బహిరంగసభలకై రాజకీయనాయకులచే తీసికొనిపోబడెనా? దరిద్రులు ఎక్కువమేతపెని తక్కువ పాలనిచ్చు ఆవులనుపెంచుట కిష్టపడుదురా? అదంతయు ఏమియుకాదు. అవులకుమేత, శిశువులకుపాలు లేకుండ చేయుటకు ఏదోజరిగినది మనతల్లులకు పాలవిలువయు దానినిగురించినదంతయు తెలుసును.

"దేశపనాని నిగా నున్నప్పుడు, అనగా ౩౦ ఏండ్లక్రింద, వైద్యులుపాలు కావలి ఇవ్వవలసినదని చెప్పగా, గ్రామజనులు అప్పుడేసించబడి, నురుగుతోనున్నపాలనే ఇవ్వదగుననిరి. వారలకు అప్పుడే విటమినులనుగురించియు తెలుసును. నైన్సుకనుగొనకముందే అనేకవిషయములను దేవతలు భారతీయులకుతెలిపిరి. అయితేఏమి? ఇప్పుడుజనులు చాలాదరిద్రులు.

"స్వరాజ్యమునకై యత్నించుటకు ఒకజాతివారలు మరియొకజాతివారిబంధములందు ఉండుటకు ఇష్టపడని ప్రకృతియేకాదు కారణము. మనమందరము మనబిడ్డలకందరకిని మంచిపాలను, మనకర్షకులకు మంచఎద్దను కావలెననికోరుచుండుటయు దీనికికారణమే. విదేశప్రభుత్వమును. దానిని స్థిరముగానుంచుటకు సిపాయీలును అధికారులును పోషించబడుచున్నంతకాలము మనకుమంచియెద్దుదొరకవు. తనఎదుట పాలీయబడి పత్రికలలో చిత్రించబడు కొలదిమంది శిశువులు మాత్రమేకాదు ఈదేశములో ఆకలిగొన్నవారలందరును అలిన్లిత్ గోగారికే తెలియును. ఈపాలవిధానము వారిని నేనుగా స్వరాజ్యమువరకుతీసికొని పోవును. లేదా వారకపిచ్చినివదలుదురు. నిజము ఎప్పటికైనను ఒకటే, అభేద్యము.

# అంగారక చంద్రగ్రహములను చేరగలము

గం. ౧కి ౭౦౦౦౦ మైళ్లప్రయాణమును చేయురాకెట్లో

ఇక్లయేటర్ అను బ్రిటిషువాడు "రాకెట్స్ త్రూస్పేస్" [స్థలములో రాకెట్లప్రయాణము] అనుగ్రంథములో రాకెట్లలో గంటకు ౭౦౦౦ మైళ్లవేగముగల అంగారక గ్రహమువద్దకును చంద్రగ్రహమువద్దకును మన నేటి యువకులు ఏదో పోగలకాలము రాకతప్పదనినారు: అంతవేగముగల రాకెట్లను నిర్మించవచ్చునని పరీక్షచే తేలినది: మరియు, ఇంకను అంతవేగమును ప్రయాణికులు సహించజాలరని తెలియజేను: కాని నలుగురు జర్మనీయుకులును, కోడిపెట్టలును, పందికొక్కులును, ఎలుకలును కలిసి అవినముగ ప్రయాణముచేయగా సుష్ఫలితములేవియు కనపడనందున, ఇపుడు అనగలనని వ్రాసిరి.

# వైమానిక ప్రమాదముచే ౧౨ మంది మరణించుట

లండన్, జూన్ ౨౫—:

ఏడెన్ నకు తూర్పుదిక్కున ౧౨ మైళ్లదూరమున ఆర్. ఏ. యఫ్. వారివిమానమునకు ప్రమాదము కలిగెను. ప్రమాదముచే ౧౨ మంది మరణించిరి సుప్రసిద్ధవైమానికుడగు స్పెన్సర్ గారు విమానమును నడిపిరి.

నేటి విచారణలోని మూడవసాక్షి మౌల్వీ మహమ్మదు అబ్దుల్ రూఫు సాహెబు వీరు అర్బానాపరిం టెండెంటు కార్యాలయమునందు ద్యోగిగానున్నారు వీరిట్లునుడివిరి —

నేను అగ్నిప్రమాదము జరిగిననాడు సెని మాకు వెడలితిని. పడిత్రజాల గాలరీలో మొద టిసీటునందు నేను కూర్చొనియుంటిని సెని మా ప్రారంభమగుటకు పూర్వము రికార్డులు వి నిపించబడెను. అప్పుడు "కిర్ కిర్" అను విపరీతము ధ్వని మూడుమారులు వినవచ్చెను. ఇది యేమియైయుండునని నేను పదేపదే ఆలోచించితిని ధ్వని పైనుండి వినవచ్చెను నాముందు సీటులోనున్న వారితో దీనినిగూర్చి ప్రస్తావించితిని వారును ధ్వనినిగూర్చి ఆలోచించిరి. నావెనుకనున్న వారితో చెప్పితిని వారు ధ్వనినిగుర్తించుటకు తమవెనుక వైపు చూచుచుండిరి. ఇంతలో ఆట ప్రారంభమయ్యెను.

ఆట ముగియనున్న సమయమున యొకపెద్ద ధ్వని వినవచ్చెను వెంటనే నేను వెనుక మరల చూచితిని. బాక్సులకును, గోడలకును గల మధ్యప్రదేశమునందు పైనుండి యొకపెద్దమంట క్రిందికిదిగివచ్చి మరల వెంటనే పెద్దధ్వనితో పకై పైకిలేచిపోయెను. నేను దీనిని గమనించినతోడనే భయాక్రాంతుడనై నాటోపిని అచటనే విడచి బయటికి వెడలివచ్చితిని. నేను మేనేజరు ఆఫీసుగదివద్దకు పరుగెత్తుకవచ్చితిని. ఆఫీసుగది ప్రక్కనే రెండు మోటారుకారులు నిలిచియుండెను. బాక్సులలోనున్న స్త్రీలు అందోళితులై బయటికి పరుగెత్తుతువచ్చిరి. అంతసెనిమా అగ్నిప్రమాదమునకు లోనగుచున్నదను భయముతో నాభార్యాపిల్లలను పిలుచుటకై జనానా గేటువైపునకు పరుగెత్తి, జెనానా గేటులోనికి వెడలిన పురుషవ్యక్తులలో నేను ప్రథముడను నాకంటెముందచట యెవరునులేరు నేనచటికి చేరువరకు ఒకపెద్దమంట బయలుదేరెను. భయముచే నేను కొంతదూరము వెనుకకు వెడలితిని. అచట నిలువబడి నేను నాభార్యపిల్లలను తొందరగారమ్మని కేకలేసితిని. పైన నాభార్య, ముగ్గురుకుమార్తెలు, ఒక కుమారుడు నుండిరి. ఒకపాటివ్యక్తి ఆమంటలలోనే తనబట్టలను చెత్తెని మంటలబాధను తుడుచుకొనుచు పైనుండి పరుగెత్తుచువచ్చి నాముందునుండి వెడలిపోయెను. ఈతడు వల్లకోటుతో డిగికొనిపోయెను. ఈతనిని నేను పట్టుకొనజాలను ఇంతలో ౫-౬ స్త్రీలు ౭-౮ పిల్లలు పైవరాండాలోకివచ్చిరి. ౧౦-౧౨గురు పురుషులు గూడ వరాండాలోకివచ్చిరి. నేను వారివందరిని దూకుమని ప్రోత్సాహపరచితిని. అంత ౧౨ సంవత్సరముల పిల్లవాడొకడు క్రిందికిదూకెను. నేనును నాప్రక్కనేయున్న మరి యిద్దరుగురు పురుషులును ఆబాలుడు క్రిందబడకుండ పట్టుకొంటిమి తరువాత ౧౦ సంవత్సరముల బాలిక దుమికెను. ఈమె నాకందలేదు స్త్రీలనుగూడ దుముకుమని ప్రోత్సాహపరచితిని. కాని వారికి పైనుండి దుముకుటకు ధైర్యము చాలకుండెను. ఇకమావి నాప్రక్కనున్న వారితో దయచేసి నిచ్చెనతెచ్చి స్త్రీలను కాపాడుడని మొరపెట్టుకొంటిని వారు నిచ్చెనను తెచ్చిరి. ఇది వెదురుబొదుగులతో చేయబడినది. ఈనిచ్చెన వేయగనే పైనున్న స్త్రీలందరును ఒకేసారి నిచ్చెన పైకి రాబయత్నము చేయసాగిరి. క్రిందినుండి వారికి సాయముగానుండు నుద్దేశ్యముతో ఒక మనుష్యుడుగూడ పైకెక్కి ప్రారంభించెను కాని యింతభారమునకు ఆగజాలక నిచ్చెన మధ్యను విరిగెను. పైనున్నస్త్రీలు క్రిందబడిరి.

# సెనిమాహాలు దురంతముల విచారణ

రెండవపేజి తరువాయి

పైవరండాలో యింకే స్త్రీయు లేకుండెను. క్రిందికివచ్చినవారిలో నాభార్య, పిల్లలు అగుపడలేదు, నాఅప్పటిస్థితి నుడువజాలనట్టిది గానుండెను నాయిల్లు, నాసర్వము నాశమయ్యెనని కేకలిడితిని వారులోపలనుండి రేమోననుఅనుమానముతో అగ్ని ప్రజ్వరిల్లుచున్నదనియు, పిల్లలతోసహా వెంటనే రావలసినదనియు పెద్దగా అరచితిని కాని లోపలనుండి నాభార్యయేకాని పిల్లలేకాని వచ్చుటకు బదులుగా పెద్దపెద్ద నిప్పుమంటలు రాజొచ్చెను.నాకపుడు నిరాశ అధికమయ్యెను. దుఃఖము భరింపరానిదిగా నుండెను. ప్రపంచము తలక్రిందగుచున్నట్లుగా నుండెను. ఆదుఃఖావేశముతోడనే క్రిందపడిపోయితిని.

కొంతసేపటికి నన్ను ౨-౩ విద్యార్థులు లేపి ధైర్యమొసగిరి. వీరు ముఫీదుల్ నాం హైస్కూలు విద్యార్థులని పిమ్మట తెలిసినది.

ఇంతలో నేనాతో సెనిమాలోనున్న నామామగారుగూడ నావద్దకువచ్చిరి ఆచటికిమరికొందరు వచ్చిరి సెనిమావెనుకభాగమునందుగలబండపైకి సినిమాలోనుండి కొందరుస్త్రీలుగూడ యుండవచ్చుననియు, పోయిచూడుడనియు వారునాతోనుడివిరి, ఈస్థలము నాకపరిచితమైనదైయుండెను అందుచే నేనువెళ్లజాలకపోయితిని. నేనుమరల సెనిమాముందు భాగమునకు పరుగిడుచువచ్చితిని సెనిమాముందుభాగము బాల్కనీలో ముగ్గురుపురుషులు నాకగుపడిరి, మిషనారూం కాలిపోవుచుండెను. సెనిమాపైకప్పుభాగమున నొకపురుషుడు కేకలిడు నిలిచియుండుటగాంచితిని. ప్రక్కనేయున్నతోటలోనికి పైనున్నవ్యక్తికి దూకుమనికేకలిడుచు నేనచటినుండి పరుగెత్తితిని. ఆతోటలోనుండియే నేనువెదకుకొనుచు బండపైకివెడలితిని. అచటకొందరుస్త్రీలు. పిల్లలునుండిరి. వారిలో నాభార్యయేకాని, పిల్లలేకానిలేకుండిరి నేనుఅపుడు సెనిమాలోనుండి దిగుచుండగా యెవరినిచూడలేదు నేనుకందస్వామితోటమార్గముగా బయటికిచ్చితిని అచటనాతో సెనిమాప్రక్కనగల యింట్లవద్ద కొందరు స్త్రీలుగలరని కొందరనిరి. పరుగెత్తుచు నచటికివెడలితిని. మజహరుఅందుకాపెసీవద్ద కొందరు స్త్రీలుండిరి. వారియందును నాభార్యపిల్లలులేరు నేనచటినుండి రాయల్ టాకీసుకద్దకువచ్చితిని. వెసెండుటాకీసుమేనేజరు నన్నులోనికితీసుకొనిపోయి కూర్చుండబెట్టెను ఇంతలో అవసుబిన్ నాసిరుఅను సజంజమియ్యతు సంఘముయొక్క యుద్యోగి నావద్దకువచ్చి నాభార్యను, బిడ్డను నీయింటియందు చేర్చివచ్చితిని. మిగతవారలను వెదకుటకై నేనురాయల్ టాకీసు ప్రవేశద్వారమునుండి బయటికివచ్చుచుండగా అర్బానాపరింటెండెంటులగు మౌల్వీమహమ్మదలీఖాన్ సా॥ నాకుకలసి నీబిడ్డను నీయింటియందు చేర్చివచ్చితినని నుడివెను ఆచటనున్నవారు హెడుపోలీసుస్టేషన్ సుల్తానుబజారునందు కొందరు చేర్చబడిరని తెలుపుటచే నాకుమారుని వెదకుటకచటికివెడలితిని. అప్పటివరకు నాయొక్క కుమార్తె, కుమారుడు అగుపడకుండిరి. పోలీసుస్టేషన్ నందు నాకుమారుడగుపడకపోవుటచే నాభార్యను పిల్లలచటదిగబెట్టి తానువెడలెనో కనుగొనుటకై ఖుత్బిగూడెములోనున్న నాయింటికివెడలితిని. నాభార్యను విచారించితిని ఆమెయిట్లు చెప్పెను.

నేనుమంటలనుచూడగనే నిగ్భ్రాంతురాలనైతిని ఇంతలో నావెన్నుకునిప్పుఅంటుకొనెను నేననిప్పును ప్రజ్వరిల్లకుండ చేతులతో తుడుచుకొని పరిగెత్తుటకు సంసిద్ధురాలనైతిని. నాతోనున్నస్త్రీలు వెనుకవైపుపరుగిడిరి. నేనుఆచటమండలు కానవచ్చుటచే ముందువైపుకు పిల్లలతోసహా పరుగెత్తివచ్చితిని. ఆచటికి నేను క్రిందికిదుముకుటకై రేలింగునుదాటి ముందుపిల్లనుదింపుటకై ఒకచేతితో రేలింగుపట్టుకొని యింకొకచేతితో చిన్నపిల్లను దింపదలచి దానిని తీసికొంటిని. కాని బరువునాపజాలనైతిని నేను క్రిందపడవలసినటిస్థితి సంభవించునుండెను అందుచే క్రిందివారికి దయదలచి యీపిల్లను అందుకొనుడనికేకలిడుచు పిల్లను క్రిందికివిడిచితిని. నాపాదములింతలో రేలింగునుండిజారెను నేను రెండుచేతులతో రేలింగునుపట్టుకొని మిగతపిల్లలనందుకొనుటకు పైకివెడలదలచితిని. కాని నాచీర దేనికోతట్టుకొనుటచే నేనట్లు చేయజాలకపోవుటయేగాక క్రిందికిపడిపోయితిని, క్రిందపడినతోడనే పైనున్నపిల్లలకొరకేడ్చుచుంటిని. అధ్వనివినియొకవ్యక్తి "మీరుఆవతలికవెళ్లుడు మీపిల్లలుక్షేమముగావచ్చెదరు" అనినుడువుటచే నేనుబయటికివచ్చితిని. ఆచటనేను పైనుండిపడవేసినపిల్ల యొకరవికనుండి గైకొంటిని. నన్నెవరో నాయింటికిచేర్చిరి"

పిమ్మట నాకుమార్తెను నీవెచటినుండి వచ్చితివి! తమ్ముడు, చెల్లెలు ఎచటనున్నారని అడిగితిని. ఆపెతనొక షేర్వానితోడిగికొనినయాతడు క్రిందికిపడవేసెననియు, నన్నెవరో బయటికిదెచ్చుకొని వచ్చిరనియు, నేనచట మహమ్మదలీఖాన్ సా॥ను చూచితిననియు, వారు నన్నింటికి తీసికొనివచ్చిరనియు నుడివెను. ఎక్బాలు (కుమార్తె) క్రిందపడవేయబడినదనియు, ఉస్మాన్ (కొమారుడు) పైననేయుండెననియు ఆపె తెలిపెను.

ఈవార్త తెలిసికొని మరలనేను సెనిమాకు పరిగిడుచువచ్చితిని. నేనువచ్చునప్పటికి మంటలుచల్లారెను. లోనికివెడలితిని. గాలరీపైకాలిపడిపోయిన శవములను చూచితిని. రెండుశవములు బయటికి దీయబడుచుండగా చూచితిని. ఇంతలో"జరుగుడు. జరుగుడు"అను శబ్దములు వినవచ్చెను. వెండిపొందన్ మొదలగువస్తువులలోనినుండి కొన్నిరాబడి రక్షకశాఖోద్యోగుల వశమొనర్ప బడుచుండెను. సెనిమాను రక్షకోద్యోగులు కాపాడుచుండిరి, అందుచే నేను బయటికివచ్చితిని. నిరాశాపూరిత హృదయుడనై యింటికివెడలితిని.

తెల్లవారిమరల సెనిమాకువచ్చి ఉద్యోగుల అనుమతిపొంది లోనికివెడలితిని. సెనిమావద్ద షేర్వానితొడిగికొనిన యొక బాలునిశవము లభించినటుల వినియుంటిని. నాకుమారునిశవమును గుర్తించితిని. గైకొంటిని. నేనుపైరుబిగేడు ఉద్యోగులేకాని, రక్షకశాఖోద్యోగులేకాని సహాయము చేయుచుండుట చూడలేదు. ఫైరుఇంజనులను చూచితిని.

ముత్తాజుహుసేన్ [సెనిమాఉద్యోగి] సయ్యదుఇమాం, అడివిరావు [గవర్నమెంటునందుద్యోగి] సాక్షుల నొసగినని కమీషన్ రెండవదినమునకు వాయిదబడెను.

---





## గోలకొండ కవులసంచిక

| | | | |
|---|---|---|---|
| చందాదారులకు | వెల | రు | ౧-౦-౦ |
| ఇతరులకు | ,, | ,, | ౨-౦-౦ |

# ముసల్మానుల కళలకును, శాస్త్రములకును హిందువుల సేవ

"వేదాంతకేసరి"లో ప్రొఫెసర్ యం.ఏ. షుష్టరీఅను పారసీకపండితుడు ఒక వ్యాసము వ్రాసినాడు. అందుండి ఈక్రిందిభాగమును పునః ప్రకటించుచున్నాము. ఈభాగమున భారతదేశమునకును ముసల్మాను ప్రపంచమునకును గల విజ్ఞానసంచయ విషయమునగలపరస్పరసంబంధము విపులముగ వర్ణించబడినది:—

అబ్బాసయ్యదుయొక్క పరిపాలనలో, ముసల్మాను సామ్రాజ్యముయొక్క రాజధాని డెమాస్కస్‌నుండి బాగ్దాదుకు మార్చబడుటచే బాగ్దాదు ముసల్మానుపండితులకు గొప్పకేంద్రమయ్యెను. దూరదేశములనుండి పండితులు పిలిపించబడిరి. వారలలో ఈక్రిందివారలు హిందువులు.

౧] మంకా (మాణిక్య లేకమాణిక్) పేరుపొందిన వైద్యుడు, తత్వవేత్త, అతడు పార్సీలోను సంస్కృతమందును మంచి పరిచయము గలవాడు. అతడు మరియొక హిందూపండితుడగు షణుకునిచే విషమునుగ్గూర్చి రచించబడిన గ్రంథములను పార్సీలోనికి అనువదించెను. అతడు, బాగ్దాదులో హారూనుర్ రషీదుఅను పేరుపొందిన ఖలీఫా రాజ్యమేలుచుండిన కాలములో మెసపొటేమియాకు మొదటిసారి పోయెను. అఖలీఫాయొక్క కీర్తి వినిని, అతడు బాగ్దాదుకు పోయి త్వరలో అచటిజనులలో విఖ్యాతిగాంచి, అచటిపండితులచే సమ్మానములనందెను. అక్కడివైద్యులచే కుదుర్చుటకు సాధ్యపడని ఒక రోగమునుకుదిర్చి అతడు ఖలీఫాను కాపాడెను.

౨] వహ్లాహుని కుమారుడగు సాలెహుడు ఆయుర్వేద వైద్యమందు గొప్పపండితుడు. అతడు అఖలీఫాయొక్క జ్ఞాతియగు ఇబ్రహీమును ఇతరవైద్యులందరు మరణించినట్లు తలచుటచే పూడ్చిపెట్టబోవుచున్న సమయమున, అడ్డుపడి, అందరును శవమనుకొనుచుండినవానికి చికిత్సచేసి. రోగమునుమాన్పికీర్తిగాంచెను. తర్వాత అతడు ఇస్లాంమతము స్వీకరించి, రాజసమ్మానితులలో ముఖ్యుడై అచటనే కాలము గడిపెను.

౩] ధన్ అను భారతీయవైద్యుడు బాగ్దాదులోనుండిన బార్మాకియా ఆస్పత్రిలో ఉద్యోగమునుపొందెను. అతనికుమారుడు ఆదేఆస్పత్రియొక్క ప్రధానవైద్యుడై, సంస్కృతమునుండి అనేక గ్రంథములను అరబ్బీలోనికనువదించెను

౪] షణక్ (చాణక్యుడు) వైద్యుడు, తత్వవేత్త. అతడు పార్సీలోకిని అరబ్బీలోకిని చేయబడిన ఈచెప్పబోవు అనువాదగ్రంథములను రచించెను. (అ) అయిదు అధ్యాయములలో విషమునుగూర్చి చెప్పు గ్రంథము. ఈ గ్రంథమును మంకుడు, అబుహాతిం, బాల్కి (ఖలీఫా కుమారుడగు యాహ్యాయొక్క ఆజ్ఞచే వ్యాఖ్య వ్రాసినవాడు) మున్నగు అనేకపండితులు అనేకభాషలలోనికి అనువదించిరి, వ్యాఖ్యానములతో నలంకరించిరి. వారలలో కడపటివాడు సయ్యదున్న జౌహరికుమారుడగు అబ్బాసు. [ఆ] జ్యోతిశ్శాస్త్ర గ్రంథము. [ఇ] మంతాహులు జవహార్ అను సద్గుణప్రబోధక గ్రంథము. [ఉ] పశువైద్యమును గూర్చిన నాలుగవ గ్రంథము.

౫] కంకుడు లేక కణకిరాయుడు వైద్యుడు, జ్యోతిశ్శాస్త్రవిదుడు. ఇతడు చెప్పబోవు గ్రంథములను రచించెను. అవిఅరబ్బీలోనికి అనువదించబడినవి. [అ] ఉన్నమూదర్ ఫి అమర్ కి వయస్సునుగూర్చిన గ్రంథము. [ఆ] ఇస్రారుల్ మవాలిద్ లేక జన్మరహస్యము. [ఇ] ఇక్తిరానాతులుకబీర్ వ క్విరానాతులు సఘీర్ లేక సంవత్సరములోని చిన్నచక్రములు పెద్దచక్రములు. [ఈ] ఇహ్‌దాసుల్-అలెంవర్-ఫిల్ క్విరాన్ లేక ప్రపంచ ప్రారంభము. [ఉ] కొనాష్ లేక వైద్యగ్రంథము. [ఊ] ...రణము వగూర్చి గ్రంథము.

అరబ్బీలోకి అనువదించబడిన ముఖ్యగ్రంథములలో నీచెప్పబోవున్నవి ఉన్నవి. ౧] జ్యోతిశ్శాస్త్రమందు సూర్యసిద్ధాంతము ముసల్మాను పండితులలో చాలమందికి తెలిసియుండెను. వారలద్వారా నది స్పెయినులోను, యూరోపాఖండములోపలను వ్యాపించెను. అది నాలుగు అధ్యాయములుగ భాగించబడియున్నది. [౨] జ్యోతిశ్శాస్త్ర గ్రంథమేఅగు ఖండఖాద్యకము. ౩] చరక [చరకసంహిత] మొదట పహ్లవిలోనికి అనువదించబడెను. చరకుడు ధర్మశాస్త్రవేత్త, తత్వజ్ఞుడు, కనిష్క మహారాజుయొక్క ఆస్థానవైద్యుడు. చరకసంహితలో ఎనిమిదిఅధ్యాయములు గలవు. ఆఎనిమిదింటిలో ఆకాలమున వైద్యములో తెలిసినదంతయు వర్ణించబడియున్నది. ౪] సంధాన్స [?] లేక విజయరహస్యము అనునది "కన్నిక" పండితుని కుమారునిచే అరబ్బీలోనికనువదించబడెను. ౫] నిదానము అష్టాంగ... రోగలక్షణశాస్త్రము. ఈరోగలక్షణములనుగూర్చిన విషయములలో ఆది తద్విషయక గ్రంథములు వ్రాసిన తరువాతి వారిచేతనుగూడ ప్రమాణముగ నంగీకరించబడుచుండెను. ఆగ్రంథమందుఆకాలమున తెలిసియుండిన సకలరోగములను గుర్తుపట్టు విధానమును చికిత్సావిధానమును వర్ణించబడినవి. ౬] పంచతంత్రము, హితోపదేశము పహ్లవినుండి అరబ్బీలోనికి ఇబిన్-ఈ-ముకఫాచే అనువదించబడినవి.

సుశ్రుతుడు గొప్పవైద్యుడని ముసల్మానులకుగూడ, ౧౦వశతాబ్దములలో తెలిసియుండెను. సుశ్రుతమును, చరకమును పార్సీలోనికిని, అరబ్బీలోనికిని క్రీస్తుశకముయొక్క ౭౦౦వ సంవత్సరములోనే అనువదించబడెను. మధ్యయుగములో క్రీస్తుశకపు ౧౭వ శతాబ్దమువరకు యూరపీయ వైద్యులకు అరబ్బీయుల వైద్యశాస్త్రము ప్రమాణముగనుండెను. అరబ్బీగ్రంథకర్తలద్వారా భారతదేశపు గ్రంథకర్తలును పాశ్చాత్యులకు తెలిసినవారలైరి. సూర్యసిద్ధాంతమేగాక, జ్యోతిశ్శాస్త్రమునుగూర్చి వ్రాయబడిన ఇతరభారతీయ గ్రంథములును అనువదించబడెను. బహుశా ఈశాస్త్రమునుగూర్చి గ్రంథములనురచించిన వరాహమిహిరుడును, శ్రీసేనుడును, ఆర్యభట్టుడును, బ్రహ్మగుప్తుడును, తదితరులును ముసల్మాను పండితులకుతెలిసియుండిరి. ముసల్మానులు సింధును పంజాబును జయించగనే, విశేషించి సుల్తాను మహమ్మదుయొక్క దండయాత్రలతరువాత, ముసల్మానులకు భారతీయులతో సంబంధము సన్నిహితమయ్యెను అప్పుడు ఒకరొకరి సంబంధఫలితముచే హిందు ముసల్మానుల విజ్ఞానసమ్మేళనము ఖిల్జీలకాలమందును, తొగ్లకుల కాలమందును లోధీలకాలమందును అభివృద్ధిచెందెను సికందర్‌షా కాలములో హిందువులు పార్సీ భాష చదువుటకు ప్రారంభించిరి. ఆభాషయే రాజభాషగా నభ్యసించబడుచు మొగలాయీ కాలములో సకలకళా పరిపూర్ణమై యావద్భారతదేశమునకు సామాన్యభాష కాజొచ్చుచుండెను భారతీయ సాహిత్యములోను తత్వశాస్త్రపాండిత్యములోను సుప్రసిద్ధిగాంచిన ముసల్మాను పండితులలో అబూరైహాన్ వాలీ—ఉల్—అల్బెరూని అనునతడు గలడు. అతడు సంస్కృతమును పంజాబులో వాడబడుభాషలను నేర్చుకొనెను శీఘ్రకాలములో బిరూనిపేరు హిందూపండితులకందరికనిని ఖ్యాతమయ్యెను, వారతనికి "విద్యాసాగర" అను బిరుదము నొసగిరి, అతనిగ్రంథములలో భారతీయ తత్వశాస్త్రమును గూర్చియు, భారతీయులచరిత్రము ఆచారములు మున్నగువానిని గురించియు విలువగలవిషయములుగలవు

ఇంతవరకును అరబ్బీలోకి అనువదించబడిన భారతీయగ్రంథములు వైద్యశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, సంగీతశాస్త్రము, గణితశాస్త్రము, కథలు, పురాణములు, నీతికథలు, ధర్మశాస్త్రము—వీటికి సంబంధించినవి కాని భారతదేశమును పాలించిన ముసల్మానుల కాలములో బిరూని కాలమునుండి తత్వశాస్త్రము, పురాణములు, చరిత్ర, మతము, ఇంకను ఇతరవిషయములు గూడ తర్జుమాలో చేర్చబడినవి. బానిసవంశపురాజులయొక్కయు, ఖిల్జీలయొక్కయు, తొగ్లకులయొక్కయుకాలములలోనుండిన ప్రసిద్ధకవియగు అమీర్ ఖుస్రో భారతీయ సంగీతమందు మంచిపాండిత్యముగలవారలలో నొకడు అతనికి ఆకాలమున వాడుకలోనుండిన హిందీభాష బాగుగా తెలిసియుండుటచే అతడు అభాషలో పద్యములు వ్రాయగలెను బానిసరాజులలో ఘియాసుద్దీన్ బాల్బన్, నాసరుద్దీన్ మహమ్మద్ అనువారలు పండితపోషకులు ఫెరుజ్‌షా నాగరకోటలో గొప్ప సంస్కృతగ్రంథముల భాండాగారమును చూచి, వాటిలో కొన్నింటిని పార్సీలోకి అనువదించ నాజ్ఞాపించెను లోధీరాజులు భారతీయభాషను ఆచారములను అవలంబించిభారతీయులైరి లోధీలవలెనే మొగలాయీలును, విశేషించి అక్బరును, అతని తరువాతివారును చేసిరి

## కావలెను.

టెలిగ్రాఫు మరియు స్టేషన్ మాస్టర్ తరగతులకు అభ్యర్థులు. అలవెన్సు రూ [illegible]. యూనిఫారం, బస ఉచితము. పని సూక్ష్మము. నిబంధనలు ప్రవేశదరఖాస్తుఫారం [illegible] అణాలు పంపినచో పంపబడును. డైరెక్టర్. రాయల్ టెలిగ్రాఫ అండ్ రైల్వే ట్యూటీస్ కాలేజి. బొంబాయి ౧౮,

తనమాల్ప భాషాజ్ఞానము చే
విభార తీయుని
ఏమనవలెను?
అతనిని భారతీయుడని
చెప్పదగునా!"

# గోలకొండపత్రిక

GOLKONDA PATRIKA
HYDERABAD-DECCAN
The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper
for H.E.H. The Nizam's Dominions.

వర్తకులకు
నిజాంరాష్ట్రీయ ఎనిమిది
జిల్లాలలోని ఆంధ్రుల
లో మీవర్తకవృద్ధికి
సాధనము? గోలకొండ
పత్రికలో ప్రకటనము

Vol. 11. | Monday 29—6—1936 | No. 15

# వర్ణాంతర వివాహములు సక్రమములైనవే

వ్యాసకర్త
## డాక్టర్ భగవానుదాసుగారు

వర్ణవ్యవస్థయొక్క మూల ప్రయోజనోద్దేశ్యము లెట్టివి? ప్రస్తుతమీ కులభేదములనుగూర్చి ఎటువంటి దుర్భ్రమలును, వక్ర సిద్ధాంతములును, మూఢాభిప్రాయములును అమలులోనున్నవి! ఈవిషయమును విమర్శించి పరిశీలించుటవల్ల యీవర్ణాంతరవివాహ శాసనప్రయోజనము బాగుగా బోధపడగలదు.

కులభేదములనునవి సంఘముయొక్క మేలు కొరకై ఒక సిద్ధాంతమువనుసరించి మనపూర్వులైనపెద్దలు నిర్ణయించిరి. కాని, ఆ మన పెద్దలు సంఘమును చీలదీయవలెనని గాని, సంఘమును భిన్నభిన్నము చేయవలెననిగాని యీవిభేదమును కల్పించియుండలేదు. ఆయావృత్తుల నవలంబించు కుటుంబములవారు ప్రత్యేకముగా నిర్ణయింపబడి యుండుట మంచిదనియు ఒకరు అవలంబించిన వృత్తిలోని కింకొకరు రానవసరము లేదనియు ఎవరికి తగినవృత్తి ఎవరికి తగిన జీవనోపాధి వారికి స్థిరంగా కల్పింపబడినదనియు పూర్వులైనపెద్దలు కులభేదములను కల్పించిరి. కాని, కాలము గడచినకొలదిని కులభేదములు అంతకంతకు వృద్ధియైనవి. ఒక్కొక్క కులములో అనేకశాఖలు అంతశ్శాఖలుకూడా బయలుదేరినవి. ఈవిధముగా ౧౯౦౧ సం॥ జనాభా లెక్కలనుబట్టి చూడగా యీదేశములో ౩, 323 కుల భేదములు యీదేశమందు కలవని లెక్క తేలినది. ఈ కులభేదములు అంతకంతకు హెచ్చుచున్నవేగాని తగ్గుటలేదు. అప్పటికంటె యిప్పుడీశాఖాభేదములు అంతర్వర్ణ విభేదములు మరింత ఎక్కువగా పెరిగి రమారమి 3 వేలవరకును వెలసినవి. ఈ విభేదములవల్ల పరస్పర పంక్తిభోజనములు లేకయున్నవి. వివాహ సంబంధములు అసలేలేవు. ఎవరైనా అందుకు విరుద్ధంగా ప్రవర్తించి వివాహ భోజనాదులు జరిపితే సంఘబాహ్యులుగా వెలివేయబడుదురు. వారికి సంఘంలో మర్యాదలేదు. వారికి న్యాయతః ఉండవలసిన హక్కులుకూడ ఉండకూడదంటారు.

ఇతర దేశాలలోను, ఇతర జాతులలోనుకూడ అనేక లోపములు ఉండగలవు. ఇంగ్లాండులో ౧౮౦౦ సం॥వరకును భార్యలను కొనుక్కునేవారు, భార్యలను అమ్ముచుండేవారు. ౨౫ గిన్నీలు మొదలుకొని,అరపెంటు సారాయకు ఒక భార్యను కొనుక్కొనుటకు కిమ్మతు చెల్లింపబడెను. ౧౮౦౩ సం॥లోనే ౨౪మంది భార్యలు ఆరీతిగా అమ్మబడిరి. ౧౯వ శతాబ్దారంభమువరకును ఇంగ్లాండులో ఒక విచిత్రమైన ఆచారము అమలులోనుండేది. వరుడు తాను పెండ్లాడదలంచిన భార్య మెడకొక త్రాడుకట్టి ఆమెను సంతబజారులోనికి తీసికొని వచ్చేవాడు. పశువును కొన్నట్లుగా పెండ్లికూతురును కొనుక్కొనుచుండునట్టి ఆచారచిహ్నముగా యీ లాంఛనము అప్పుడు అమలులో నుండేది. చైనాలో ఆడవాళ్ల పాదములు పెరుగకుండ ఇనుప చెప్పులను తొడిగేవారు. మహమ్మదీయులలో భార్యను భర్త విడిచిపెట్టవచ్చునుగాని భర్తను భార్య విడిచివేయుట కధికారము లేదనుచున్నారు. కాని ఖురానులో ఇరువురకును సమాన స్వాతంత్ర్యమున్నదనే వ్రాయబడెను. ఈవిధముగా చూస్తే, పరిపూర్ణానోగ్యవంతుడు ఏవిధంగా ప్రపంచంలో ఉండడో, నిర్దుష్టమైన సంఘముకూడ ప్రపంచములో కన్పించదు. ప్రస్తుతము మన హిందూసంఘమునకు యీ అనంతమైన కులభేదములబాధ పెద్దపీడగామున్నది. హిందూ సంఘమునకు చెదలుపట్టినట్లయినది. గట్టిగా ఉండవలసిన సంఘము గుల్లబారుచున్నది.

## కులభేదముల పట్టింపు ఎందుచేత?

ఒక ధర్మసూత్రమును వ్యవహార సౌకర్యార్థమై సూచించి దానిని అనుసరించవలసినదిగా కోరినప్పుడు, అధర్మసూత్రమునే సందర్భ శుద్ధి లేకుండ, సార్థకత్వములేకుండ తదితర ధర్మములను సరకుగొనక, విపరీతముగా అనుష్ఠించేయెడల అదిసత్యమైన ధర్మానుష్ఠానము కాజాలదు. ధర్మముయొక్క ఆభాసమగును. వెక్కిరించినట్లుండును. సర్వధర్మ సమన్వితముగా ప్రతి ధర్మమును పాటించవలెను. వర్ణభేదమును పాటించుటకూడ ఒక ప్రయోజనముకొరకై ఒక ధర్మసూత్రము ననుసరించి యుద్దేశింపబడినది. కాని, అదియే పరమధర్మమనియు ఇతర సందర్భప్రయోజనములను లక్ష్యము చేయకుండ కులభేదధర్మమునే విధిగా పాటించవలెననియు హిందువులు వాదించుచు కులభేదతత్వమునే మితిదప్పి అమలుపరచజొచ్చిరి. ఇట్టిచర్య కేవలము పరిహాసాస్పదమై యున్నది.

* * * *

వివాహ సంబంధములుకూడ ఏవృత్తిలో నున్నవారు ఆవృత్తిలోనివారితోనే చేసికొనుచుండుటవల్ల పరంపరానుగతమైన వృత్తివ్యాపార ప్రావీణ్యాభిరుచి పెంపొందుచుండగలదను మాట నిజమే. కాని, భిన్నకుల వధూవరుల ప్రేమానురాగములను భగ్నము చేయుటవల్లకూడ సంఘమునకు అరిష్టమే వాటిల్లును. కాబట్టి కుల వృత్తినియమ కాఠిన్యము మితిమీరి వర్తించకూడదు. ఈవివాహ నియమవిషయములోకూడ ఆయావ్యక్తుల స్వతంత్ర స్వయం నిర్ణయములకుగూడ కులపెద్దలు అంగీకరించుచు తమ కులభేద నియమములకు కొంతవరకు సందర్భానుసారముగా సడలించుచుండవలెను, దీనిపేరే ధర్మసమన్వయము.

* * * *

## వృత్తి కర్మనుబట్టి ఏర్పడిన కులభేదము జన్మకారణముచేతనే నిర్ణయింపసాగిరి

కులభేదములను వృత్తికర్మలనుబట్టియే ముఖ్యముగా నిర్ణయించవలెనని మన పూర్వులైన పెద్దలు ఉద్దేశించియుండిరి. కాని కాలక్రమేణ శతాబ్దములుగడచిన కొలందియు, జన్మకారణమునే మనవారు ప్రధానాంశముగా గ్రహించి కులభేదమును నిర్ణయింపసాగిరి. ప్రాచీనార్య యుగమునందు గురువు తన శిష్యుని ప్రతిభాసామర్థ్యమును బట్టియు అభిమానమునుబట్టియు అతనికి తగినవృత్తి నిర్ణయించుచుండేవాడు. ఆచార్యవృత్తినో, భిషగ్వృత్తినో, క్షేత్రవృత్తినో, వణిగ్వృత్తినో నిర్ణయించుచుండేవాడు. ఒకవృత్తిలోనున్నవాడు మరొకవృత్తియందు ప్రవేశించి ప్రవర్తింపకూడదను నియమము అప్పుడుండేది. ఈకాలములోకూడ గవర్నమెంటు ఉద్యోగిగా ఉండేవాడు అన్యత్ర చాటుమాటున మరొకవృత్తి నవలంబించి ద్రవ్యార్జన చేయుచుండరాదనే నియమనిషేధము కలదు. ఈ విధమైన నియమము లేనియెడల, తదితరులకు జీవనోపాధులు క్షీణించి నిర్వ్యాపారత్వము దేశములో ప్రబలగలదు.

కాని ప్రాచీనార్యయుగము గడచినపిమ్మట, ఆధునికయుగ మవతరించక పూర్వము మధ్యయుగములయందు యీ కులములు ఒకదానితోనొకటి సంకరముకాకుండ మరింత కట్టుబాట్లను ఏర్పరచుకొనెను. ఒకకులములో చేరినవారు ఒక ప్రత్యేకవృత్తి నవలంబించెడి సంఘముగా ఏర్పడి, అన్యకులముల వారిని తమలో చేర్చుకొనరైరి. ఇటీవల ఏర్పడుచున్న ట్రేడుయూనియనులకుకూడ నిటువంటి కట్టుబాట్లే ఏర్పడుచుండుట మనము చూచుచున్నాము.

మన పూర్వ ధర్మశాస్త్రములలో అనులోమ వివాహములు శాస్త్రసమ్మతముగా జరుగదగినవేయని వ్రాయబడెను. అనులోమ వివాహమనగా, ఎక్కువకులమునకు చెందిన వరుడు తక్కువ కులమునకు చెందిన స్త్రీని వివాహమాడవచ్చుననిరి. ప్రతిలోమ వివాహములనుమాత్రము నిషేధించియుండిరి. అనగా, తక్కువకులమువారు ఎక్కువకులములోని స్త్రీని వివాహమాడకూడదని అట్లయ్యును ప్రతిలోమ వివాహములను ఎవరైనను చేసికొనేయెడల అట్టివారికి ఏవైన చిల్లరవృత్తులను నిర్ణయించిరి, ఇట్టి ప్రతిలోమ వివాహములవల్ల కలిగిన సంతతివారు ఏవిధముగా సంస్కారమునుపొంది ప్రాయశ్చిత్తమునుపొంది సాధారణ చాతుర్వర్ణ్యములలో చేరవచ్చునో ధర్మశాస్త్రములయందు నిరూపించియుండిరి. పంచమవేదమైన భారతములోని విషయములను బట్టిచూడగా, బ్రాహ్మణులకును, క్షత్రియులకును పరస్పర వివాహసంబంధములు న్యూనతాధిక్యతలు లేకుండ జరుగవచ్చునని చెప్పబడెను. ఒక వర్ణములోనివారు ఇంకొకవర్ణములోనికి తరచు చేర్చుకొనబడుచున్నారని కూడ భారతములో చెప్పబడెను.

అనులోమ వివాహములను చేసికొనవచ్చునని శాస్త్రములు చెప్పుచున్నను అట్టివి మనదేశములో జరుగుటలేదు. నేపాళదేశములో మాత్రము నేటికిని అనులోమ వివాహములు స్వేచ్ఛగా జరుగుచున్నవి. అనులోమ వివాహములు జరుగవచ్చునని శాస్త్రము సమ్మతించినను జరుపకపోవుటకు కారణము ఏమని చెప్పుచున్నారు? ఉత్తమజాతివానికి అధమజాతిస్త్రీ సంపర్కమువల్ల ఉత్తమసంతానము కలుగదనియు, అల్పరక్త సంబంధమువల్ల ఉత్తమరక్తమున మాలిన్యము కలిగి అపభ్రంశమగుననియు అనుచున్నారు. కాని,స్వశాఖలోను స్వవర్ణములోను అతికఠినములైన కట్టుబాట్లతో వివాహసంబంధములను చేసికొనుచున్నప్పటికిని తద్వారా కలుగుచున్న సంతానము ఆయా స్వకులవృత్తులయందే ప్రత్యేకాభిరుచులను కలవారైయుండుటలేదు. వారి చిత్తవృత్తులు భిన్నమార్గముల ననుసరించుచున్నవి. ఎట్టి వృత్తులకైనను ఎగబడుచున్నారు. మీదుమిక్కిలి మన సంతానము నానాటికి దుర్బలమై నిర్వీర్యమగుచున్నది

'సర్వేసర్వాసు అపత్యానివర్ణాః సంజనయంతి'
(మహాభారతంఅరణ్యపర్వం౧౮౦—వఅధ్యాయం

వర్ణాంతర వివాహములవల్లనే మనసంతానము మరింత బలిష్ఠమైనదై యుండగలదు.మరింత విశుద్ధమైనరక్తము మనలో ప్రవహింపగలదు. స్వవర్ణములోనే స్వశాఖలోనే బీరకాయపీచు సంబంధము చేయుచుండుటవల్లనే మన సంతానము నిరంతరము నీరసించుచున్నది.

మన ప్రాచ్యదేశములలో జపానుదేశప్పుడు పాశ్చాత్య సంస్కార వాసనవల్ల కములైన సాంఘిక పరివర్తనములు కలుగుచున్నవి. మనదేశములోకూడ గృహస్థధర్మములు, దాంపత్యధర్మములు పాశ్చాత్య సంపర్కమువల్ల తారుమారగుచున్నది. ప్రాత సంప్రదాయములు ఊగులాడుచున్నవి. కూలిపోవుటకు సిద్ధముగనున్నవి. ప్రజాధికారము చెలరేగినయెడల మనసంప్రదాయములలో మంచివేవో చెడవేవో విచక్షణలేకుండా అన్నింటిని ధ్వంసము చేయుట తటస్థించును. కాబట్టి జరుగవలసిన సంస్కారము దారుణ విప్లవమార్గము ననుసరింపకుండ సౌఖ్యంగా జరుగుటకై మన మీచట్టమును ఆమోదించి అమలుపరచవలెను.మనసాంఘిక ధర్మములలో మంచివానిని కాపాడి,చెడ్డవానిని మాత్రమే తొలగించుటకై యీసౌమ్యమార్గమును అనుసరింపవలెను. లేనిచో మంచివి చెడ్డవికూడ మహావిప్లవములో సర్వనాశనమగును.

ఆంధ్ర పత్రిక.

---



Printed and Published by B. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad. Editor K. Balakrishna Reddy.